శ్రీగురవేనమః.

# జడభరతోపాఖ్యానము.

## వచనకావ్యము.

ఇది

అచలగురుడు

పోకల - శేషాచలము నాయనివారిచే

రచియింపఁబడి,

తత్పుత్రపౌత్రుండగు

అచలవిశిష్టావధి

పోకల - వేంకట నరసింహారావు నాయనిచే

పరిష్కరింపఁబడి,



రెండవకూర్పు—౧౦౦౦ ప్రతులు.

చెన్నపురి: ప్రాతచాకలపేట యందుండు

వర్తక - బాల్కేరాయసెట్టిగారి

శ్రీరామరాజేశ్వరీ నిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియెను.

1928

Price 8 As. — వెల ౮ అణాలు.



అచలగురుండు,

పోకల - శేషాచల స్వాములు,



శ్రీగురవేనమః.

# జడభరతోపాఖ్యానము.

## వచనకావ్యము.

---

### పూర్వభాగము.

శ్లో॥ గురురాదిరనాదిశ్చ। గురుఃపరమదైవతం।
గురుమంత్రసమోనాస్తి। తస్మైశ్రీగురవేనమః॥

శ్లో॥ నిత్యంశుద్ధంనిరాభాసం। నిరాకారంనిరంజనం।
నిత్యబోధంచిదానందం। గురుంబ్రహ్మనమామ్యహం॥

శ్లో॥ కిమత్రబహునోక్తేన। శాస్త్రకోటిశతైరపి॥
దుర్లభాచిత్తవిశ్రాంతి। ర్వినాగురుకృపాంపరాం॥

శ్రీమదఖండ సచ్చిదానంద రహితుండును, నాద బిందు కళాతీతుండును, సర్వద్వంద్వ వివర్జితుండును, ప్రకృతిత్రయ దోష రహితుండును, నిత్యనిర్మలుండును, వేదాంత వేత్తయును, సకల పరిపూర్ణ స్వరూపుండును, కేవలాత్ముండును నగు సద్గురుస్వామికి శిష్యుండును, బ్రహ్మ సంశోభితుండును, నాత్రేయగోత్రజుండును, నాటి వెలమ కులోద్భవుండును నగు, పోకల - రామగోపాలు నాయని

వారికిఁ దృతీయ పుత్త్రుండును సాధుజన మిత్త్రుండును పోకల - కేశవాచలాహ్వయుండును నగు నేను, శ్రీమద్భాగవతమునందు శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పిన జడభరతోపాఖ్యానమును పద్యకావ్యమును, నా నేర్పుకొలందిఁ వేదాంత ధర్మముల నెల్లరునుఁ దెలుసుకొని మోక్షమునుం బొందునటుల సులభోపాయంబుగ, వచనరూపంబున, స్త్రీపురుషాదులకు హృద్గోచరం బగునటులఁ, బింక- వక-రూప- రూపాతీతభావము లను చక్కఁగాఁ దేటపడునటుల విస్తరించి నే రచియింపం బూనిన నీగ్రంథంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన:—

శ్రీమదనంత నిగమాంత గోచరుండును, సనవద్య విద్యాద్వైత మకరందపానానంద తుందిలుండును, నిరంతర నిర్వికల్ప తత్పరుండును, నిఖిల బృందారక వందితుండును, వేదవ్యాసమహాముని పుత్త్రుండును, మహాయోగపురుషుండును, సకల పరిపూర్ణ స్వరూపుండును నగు, శ్రీశుకమహాముని, పరీక్షిన్నరేంద్రునిం గాంచి, యో రాజచంద్రమా! నీవు సర్వభయంబునకు వెఱవవలదు. సర్వజనానందంబును, సకల దురితహరంబును, సర్వభయ నివారణంబును, జన్మనాశంబును, మోక్షానందంబునుఁ గలిగించెడు, జడభరతోపాఖ్యానంబను నొక పుణ్యచరిత్రమును జెప్పెదను. నీవు నిర్మల చిత్తుండవై వినుమని యిట్లనియె.





శ్రీశుకమహాముని పరీక్షిన్మహారాజునకుం జెప్పిన,

జడభరతోపాఖ్యానము.

భరతుని వంశానుక్రమంబు.

రాజేంద్రా! శ్రీమంతంబును ననంతజంతునికాంతంబునునగు నీ భూవలయంబు బ్రహ్మమానస పుత్త్రుండును,

చతుర్దశ మనువులలో నాదివాఁడగు స్వాయంభువమనువు ప్రజాపాలనంబు సేయుచుండెను. అతనికి శతరూపయను భార్యయందుఁ బ్రియవ్రతుండును, నుత్తానపాదుఁడు నను నిరువురు సుపుత్రులును, ప్రసూతి, ఆకూతి దేవహూతి యను మువ్వురు పుత్రికలును జన్మించిరి. అందుఁ బెద్దవాఁడైన ప్రియవ్రతుఁడు కర్దమ ప్రజాపతి కూఁతురగు సుకన్యయను దానిం బెండ్లియాడి, యామెయందు ఆగ్నీధ్రుఁడు, అగ్నిబాహువు, వపుష్మంతుఁడు, ద్యుతిమంతుఁడు, మేధ, మేధాతిథి, హవ్యుఁడు. సవనుఁడు, పుత్రుఁడు, జ్యోతిష్మంతుఁడు నను పదుగురు కుమారులను సమ్రాట్టు, కుక్షియను నిరువురు కూఁతుండ్రను గనెను. వీరిలో అగ్నిబాహువు, మేధ, పుత్రుఁడు నను మువ్వురును బునర్జన్మంబగు నరకకూపంబునకు వెఱచి, జన్మరహితులై శాశ్వతసుఖానందమగు మోక్షపదవినిం బొందుటయం దృష్టిగలవారై తుచ్ఛములగు నీలోక సుఖములను రోసి, శరీరాభిమానములను విడిచి యోగజ్ఞానానుష్ఠాన పరులై యవధూతాశ్రమంబులం జరించిరి. తక్కిన యేడ్గురు పుత్రులకు నా ప్రియవ్రతుండు భూమిని నేడు ద్వీపములుగా భాగించి యాగ్నీధ్రునకు జంబూద్వీపంబును, వపుష్మంతునకు శాల్మలీ ద్వీపంబును, ద్యుతిమంతునకుఁ గ్రౌంచ ద్వీపంబును, మేధాతిథికి ప్లక్ష ద్వీపంబును, హవ్యునకు శాకద్వీపంబును, సవనునకు పుష్కర ద్వీపం



బును. జ్యోతిష్మంతునకు కుశద్వీపంబును నీప్రకారముగాఁ బంచియిచ్చి యాయా ద్వీపములకు వారివారినిఁ బట్టాభిషిక్తులుఁగాఁ జేసెను. ఆ యాగ్నీధ్రుఁడు బహుకాలము తనపాలికి వచ్చిన జంబుద్వీపంబును బాలించుచుఁ దన భార్యయగు పూర్వచిత్తియను నప్సరసయందు నాభి, కింపురుషుఁడు, హరి, ఇలావృతుఁడు, రమ్యకుఁడు, హిరణ్వంతుఁడు, కురువు, భద్రాశ్వుఁడు, కేతుమాలుఁడు నను తొమ్మండ్రు పుత్రులనుం బడసెను. పిమ్మట నాగ్నీధ్రుఁడు తానుబాలించెడు జంబూద్వీపమును దొమ్మిది ఖండములుగా భాగించి, తనదు సింహాసనముండు ముఖ్యపట్టణము మొదలుకొని హిమవంతంబునకు దక్షిణము వఱకునుండు నజనాభంబను ఖండమును నాభికిని, హిమవంతంబునకు నుత్తరంబునను హేమకూట పర్వతంబునకు దక్షిణంబుననుండు ఖండంబు కింపురుషునకును, హేమకూట పర్వతంబుకు నుత్తరంబునను నిషధ పర్వతంబునకు దక్షిణంబునను నుండు నైషధఖండంబు హరికిని, నిషధ పర్వతంబునకు నుత్తరంబునను మేరుపర్వతంబునకు మధ్యనుండు నిలావృత ఖండంబు నిలావృతునకును, నిలావృతంబునకును నీలాచలంబునకును మధ్యనుండు ఖండంబు రమ్యకునకును, నీలాచలంబునకు నుత్తరంబునను శ్వేతపర్వతంబునకు నడుమనునుండు శ్వేతఖండంబు హిరణ్వంతునకును, శ్వేతాచలంబునకు నుత్తరంబున శృంగవంతంబుచేఁ జుట్టంబడిన ఖండంబు కురువునకును, మేరువునకుం

దూర్పువనుండు ఖండంబు భద్రాశ్వునకును, మేరువునకుం బశ్చిమ భాగంబుననుండు ఖండంబు కేతుమాలునకును బంచిపెట్టెను. ఈ తొమ్మిదింటిని నవఖండంబు లనియును, నవవర్షంబు లనియునుఁ జెప్పంబడును. ఆగ్నీధ్రుని జ్యేష్ఠపుత్రుండగు నాభి తనపాలికివచ్చిన జంబూద్వీపంబునుఁ బాలించుచుఁ దన ధర్మపత్నియగు మేరుదేవి యందు ఋషభుండను సుపుత్రునిం బడసెను. ఆ ఋషభుఁడు శ్రీవిష్ణుదేవుని యంశంబున నుద్భవించినవాఁడై నూర్గురు పుత్రులనుఁ గాంచెను. వారిలోఁ గొందఱు భూలోక సుఖంబులు మిగులఁ దుచ్ఛంబులనియును, ఘోర నరకంబగు పునర్భవంబు కూడదనియును, శాశ్వత సుఖానందమగు మోక్షమునే పొందవలయుననియును, సద్బోధమునుఁబొంది వనంబులకుం బోయి దీర్ఘసమాధులనుఁ గావించి బ్రాహ్మణులైరి. ఆఋషభుఁడు తక్కిన వారికి సదాచార క్రమంబులను, ధర్మశాస్త్ర నీతిశాస్త్రంబులను, ధర్మార్థ కామంబులను నుపదేశమునుఁ జేయించి, వారిలో సకల సద్గుణములుగలిగి శౌర్య ధైర్య పరాక్రమ వంతుండగు భరతుండను పుత్రునకుఁ దనరాజ్య పట్టాభిషేక మహోత్సవముఁ గావించి యా ఋషభుఁడు జ్ఞానమాత్రావశిష్టుండై యవధూతాశ్రమమునుం బొంది జితేంద్రియుండై యే సంకల్పములును లేక తన చిత్తమును బ్రహ్మమునందు విశ్రాంతినిం బొందించి దేశ దేశంబులు



గ్రహించుచుఁ గేవలాత్ముఁడై పరిపూర్ణుండై పరమ పదమును బొందెను.

భరతుని వృత్తాంతము.

ఆ భరతమహారాజు ధర్మయుక్తముగాఁ బిత్రురాజ్యమును బాలించుచుఁ దన భుజబలంబుచేత నెల్ల దేశములనుఁ గ్రమక్రమంబున జయించి రాజులనెల్లఁ దన కేలుబడికిం దెచ్చుకొని రాజరాజని పేరుపొంది, కీర్తి కాముండై, యష్టైశ్వర్యసంపన్నుండై తేజరిల్లుచుఁ బంచజన్య యను సాధ్వీలలామను వివాహము చేసుకొని యామె యందు, సుమతి, రాష్ట్రభృక్, సుదర్శన, ఆవరణ, ధూమ్రకేతువులను నైదుగురు పుత్రులనుఁ బడసి, సద్ధర్మపరుండై రాజ్యమునుఁ బాలించుటంజేసి యిగా నజనాభంబను వర్షమునకు భరతవర్షంబను పేరు గలిగెను. అంత నా భరత మహారాజు తనతండ్రి పోలిన విధంబుగా, శాంత శమదమాది సద్గుణంబులు గలవాఁడై సర్వ సత్కర్మములనుఁ జేయుచు, పాత్రాపాత్రంబు లెఱింగి వివిధ దానంబులఁ గావించుచు, కరుణాసముద్రుండై, పురజనులనుఁ గాపాడుచు, జటాధారులగు పెద్దలను రావించి వారికి యర్ఘ్యపాద్యాది విధులఁ గావించి సంతుష్టులం జేయుచు, వారివలనం బరమధర్మంబగు మోక్షమార్గమునుఁ గ్రహించుచుఁ, జిత్తమును శ్రీవిష్ణుదేవుని పాదపద్మములయందుఁ జొప్పించుచు, రాజసూయాశ్వమేధా

మును దత్తరపాటునుం బొంది, సింహము తనదగ్గఱకు వచ్చునను తలంపుచేతఁ బ్రాణభీతినిం బొంది, గడగడ వణఁకుచు నలుదిక్కులు పరికించుచు, దిగ్గునవడి భయంబునం బెదరి మిన్నంట నెగిరి, తీరంబునకుం లంఘించు సమయంబున నాలేడి గర్భంబు కలంగి, పిండంబు జాఱి యాపిండమా నీళ్లమీఁదను, తానా యేటియొడ్డునను బడి విలవిలఁ దన్నుకొని మృతిఁబొందెను. నీళ్లమీఁదం బడిన యాలేడికూన ప్రాణములు గలదియై కాళ్లు గదలించుచు, మెడ యెత్తుకొని యానీళ్లమీఁదఁ దేలి యాడుటనుఁజూచి, సోహంభావనాసక్తచిత్తుండును, నిర్మోహుండును, నాత్మానందుండును నగు నా భరతుండు భూతదయాయుండును, బశ్చాత్తాపమునుం బొంది, యాజింకకూన నీళ్లలో మునిఁగి మరణము నొందునని యోచించి త్వరితముగ నదటికింబోయి, యా జింకకూనను రెండు హస్తములతోఁ బట్టి యెత్తి యక్కునం జేర్చుకొని తెచ్చి దాని తల్లికి సమీపంబునం బెట్టి, మృతిబొందిన నా జింకనుంజూచి, యకటా! సింహముయొక్క ఘోరంబగు. గర్జనవలనభయపడి యాహరిణంబు హరణంబయ్యెనని మనంబున విచారము నొందుచుండఁగా, నాలేడిపిల్ల లేచి మెల్లమెల్లఁగా నడుచుచుఁ జచ్చిపడియుండిన తన తల్లియొద్దకుం బోయి దాని చన్నుగుడుచు సమయంబున, నా రాజఋషి యాపిల్లను బట్టుకొని, యకటా! విధినాథుఁడు దీనిని దిక్కులేని బిడ్డగాఁ జేసెను. ఈ యడవిలో దీనిని



రక్షించువారెవ్వరు? దుష్టమృగములుఁ జంపి భక్షించుటకు సందియంబు లేదు. దీనిని రక్షించుటకు నీయడవిలో నేను దప్ప మఱి యెవ్వరును లేరు. నే నెటులు దీనినిఁ బ్రతికింపనగునని క్షాంతసేపు యోచించి, యాహా! దీనిని నేనే రక్షింతును గాక యని ధైర్యనిశ్చయములను బొంది, యా జింకపిల్లను దన యాశ్రమంబునకుం గొనిపోయి, లేత పచ్చికయును, నిర్మలమైన జలమును నాహారముగా నిచ్చుచు, నుదయ కాలంబునను పొలంబులకుం గొనిపోయి పచ్చికమీఁదబడిన మంచు బిందువులతోఁ గూడ నాపచ్చికను మేపుచు, నది కడుపునిండఁ దినినపిమ్మటఁ దన యాశ్రమంబునకుం గొనివచ్చుచు, నిటులఁ బ్రతిదినము పచ్చిక భూములకుం గొనిపోయి పచ్చికను మేపించుచు, దేహమును దడివి ముద్దులాడుచు, సమాధిలో నుండునపుడు నా జింకపిల్లను దన తొడలమీఁదం గూర్చుండఁ బెట్టుకొనుచు, నదీస్నానంబునకుం బోవునపుడు తన భుజములమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని పోయి యానదియొడ్డుననుండు నొక చెట్టునకుం గట్టుచు దుష్ట మృగములు వచ్చి చంపిపోవునని పలుమాఱు దానినిం జూచుకొనుచు. నొక్కొక్క సమయంబునఁ బొలములలో విడిచి తాను కట్టపట్టుకొని దానివెంటం దిరుగుచు, నా ముద్దులబంగారు! నీవు నన్ను విడిచి యెందునుఁ బోవలదని దానికిం బుద్ధులు గఱపుచు, నాజింకపిల్ల చిత్రవిచిత్రములుగా నెగురుచు గంతులు వేయుచు



భరతమహారాజర్షి.

నాడుమువచ్చి తనతోఁ దలమీఁదం బడుచుండుటకు నానందించుచుఁ, దాను సమాధిలోనుండుకాలంబున నాజింకపిల్ల దాని చిన్నకొమ్ములచేఁ దాఁకించి యతని ముక్కును మూతియును నాకుటకు మిగుల సంతసించి సమాధి చాలించి దానిం బట్టి యక్కునం జేర్చి ముద్దుఁబెట్టు



కొనుచు, నాలేడిపిల్ల తనకన్నులకుం గనుపించక దూరముగాఁ బోయి యుండుండి గంతులువేయుచు వచ్చి యాముని తన కొమ్ములను దాఁకించుచు, నిటుల మిగులఁ గ్రీడములు చేయుచుండుటను జూచి చూచి యానందించుచుఁ దనకు సమాధిలక్షణములు చక్కఁగా నెలవేఱకుండుటయును, జిత్తభ్రమణమునుఁ బొందుటయును నాత్మధ్యానము జరుగకుండుటయును, దన మనంబున యోచించక, జింకపిల్ల మోహమునందే తగిలియుండెను.

ఇట్లుండఁగా నొకనాఁడు తాను నిర్వికల్ప సమాధియుందు దేహమును మఱచియుండఁగా నా జింకపిల్ల యా యాశ్రమమునుఁ బాసి పచ్చికగల పల్లపు భూములకుం బోయి యందు మేయుచుఁ జాలాకాలము వఱకు రాకయుండెను. ఇంతలో నారాజఋషి సమాధిఁ జాలించి, దిక్కులు పరికించి, జింకపిల్ల తన యాశ్రమమునందు లేకుండుటకు మిగుల విచారమునొంది, యక్కటా! నేఁడు నా ముద్దులజింక యెందుకుఁ బోయెనో తెలియదు. దుష్టమృగంబులపాలంబడెనో, లేక పచ్చికభూములలో మేఁత మేయుచు రాక మసలెనో, యని బహువిధంబుల వితర్కించుచు నేమియుఁ దోఁచక లేచిపోయి యా జింకపిల్లను నలుదిక్కుల యందును వెదకుచు, గొప్ప కంఠధ్వనితోఁ బిలుచుచుఁ, బల్లపుభూములంజొచ్చి చూచుచుఁ, బొదలు గుట్టలు వెదకిచూచుచుఁ, జేతులు పట్టుచు, నిటుల బహుదూరము చుట్టిచుట్టి వెదకుటచేత నాయాసము చెఁ

బొంది, యొక చెట్టుక్రిందఁ గూర్చుండి నలుదిక్కులను
బరికించుచు, దనకు దూరముగా దుమ్ము రేఁగుటను గాంచి,
లేచి నిదానించి చూచి తన జింకపిల్ల తన జాతిజింకల
గొన్నింటితోఁ జేరి పరుగిడి పోవుటవలన దుమ్ము రేఁగెను
నని మనంబున తలంచి యాజింకనుం బట్టుకొనుటకు
నుత్సహించి, వానివెంబడి పరుగెత్తిపోవుచు, గొప్పకంఠ
ధ్వనితోఁ బిలుచుచు, చేతులు కట్టుచు నదిరానందుకై
చింతించుచు, నిటుల మిగుల నాయాసమునుఁ బొంది,
తన శక్తియూలి బడలికనుఁ జెంది యొక చెట్టుక్రిందఁ
గూర్చుండి, నే నిన్నిదినంబులు పెంచి కాపాడిన నా
ముద్దులజింక నేఁడు తన జాతిజింకలతోఁ గలసిపోయి
యుండునని మిగుల దిగులొంది, దేహమును మఱచి
యుండుం బడుండెనని చెప్పిన, నా పరీక్షిన్నరేంద్రుఁడు
మిగుల నద్భుతమునొంది, యోహో మహాత్మా! యిది
యేమి చిత్రము "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అను
శ్రుతివాక్యము లోకంబున నబ్బురమైపోక యెంతటి వారి
కిని ననుభవనీయముగా నున్నటుల నున్నదేగాని యెవ
రిని విడుచునటుల గనుపించలేదు, ఈ భరతఖండం
బంతయు నేకచ్ఛత్రంబునం బాలించి యనేకాశ్వమేధ
రాజసూయాది యాగములనుఁ గావించి, దేవోత్తము
లను, భూదేవోత్తములను సంతుష్టినొందించి, ధర్మదేవ
తను నాలుగు పాదంబులతో నర్తింపంజేసిన • భువన
నందితుండగు నా భరతమహారాజునకు సహితము నిటుల



ప్రారబ్ధకర్మ మనుభవనీయముగా నుండఁగా, మావంటి
యల్పజ్ఞులకును మందభాగ్యులకును నేమిగతి సంభవించు
నో తెలియదు. అకటా! నాకు జన్మకర్మములను గుఱించి
మిగుల భయంబును వగపునుఁ గలుగుచున్నది, దేవర
వారు, కర్మవిషయమును గుఱించి చక్కఁగాఁ నెఱిఁ
గింపుఁడని వేఁడిన నా తాపసోత్తముం డిట్లనియె.

రాజేంద్రా! "అవశ్య మనుభోక్తవ్యం। కృతం
కర్మ శుభాశుభం" అను నీతివాక్యంబు ఈ లోకంబునఁ
గాని మఱే యేలోకంబునఁ గాని బూటకంబులు గానే
రవు; సర్వప్రాణులకు సంచిత ప్రారబ్ధకర్మంబులు రెండును
సిద్ధముగా ననుభవనీయంబులు. ఆగామికర్మ పునర్భవంబు.
ఎంతటివారును - ఆగామి - సంచిత - ప్రారబ్ధ కర్మముల
మూటిని ననుభవించే తీరవలయును. లోకంబున నచల
పరిపూర్ణ స్వరూపులైన మావంటి యతీశ్వరులు. అనఁగా=
శరీరమున్నదను భావనయే లేనివారు. వీరికి స్థూలము
గాని, సూక్ష్మముగాని కారణముగాని, మహాకారణము
గాని, (యీ నాలుగు దేహంబులును) లేవు, వీరే సర్వ
ద్వంద్వశూన్యులు. వీరే జీవోపాధి - యీశ్వరోపాధు
లనెడు ద్వయదోషరహితులు. వీరే ప్రకృతిద్వయ దోష
రహితులు. వీరే కేవలాత్మస్వరూపులు. వీరే సచ్చిదానంద
రహితులు, వీరే వేదాంతులు వీరికి వృద్ధిక్షీణంబులును,
బంధమోక్షంబులును, పుణ్యపాపంబులును గలుగ

నేరవు. పుట్టినవారికే కర్మము లంటునుగాని పుట్టు గిట్టుటలు లేని యశరీర జ్ఞానులకు నే కర్మంబు లంటనేరవు. మఱియును నారూఢస్థితి గలిగి నిరంతర నిర్వికల్ప సమాధి పరులైన జ్ఞానులు స్వస్వరూపమునుం బొంది జ్ఞానాగ్ని యందు సర్వకర్మములను వ్రేల్చి వివిధ కర్మములకుం గారణుండగు జీవునిం బోకార్చి జీవన్ముక్తులై యున్న మహాత్ములకు సంచిత ప్రారబ్ధ కర్మంబులు రెండును బొత్తిగా నశించును గాని, యాగామి మాత్రము నశింపక బిందుస్వరూపమగు సర్వసాక్షియందు నిలిచి యుండును. ఇది సృష్టిలోపం గలసి మరల జన్మంబునకుం గొని వచ్చును. మఱియును నభ్యాస పరులయిన యోగీశ్వరులకు వైరాగ్య వర్తనంబున స్వల్ప కర్మములు నశించినను బలీయములైన సంచిత ప్రారబ్ధ కర్మంబులు రెండును వెంటనంటి యనుభవింపం జేయుచుండుట వలన, వీరు-ఆగామి కర్మకు వెఱచి భయ భ్రాంతులను బొంది జీవునిం బోకార్చెడు నుపాయంబు గానక, యుపవాస, స్నాన, జప, హోమాది క్రియలు సలుపుచు విధి నిషేధములు గలిగి వర్తింతురు. వీరు జనన మరణంబులను, పుణ్య పాపంబులను, కృతకర్మ శుభాశుభంబులను ననుభవింతురు గాన, నెట్టివారికి ననుభవము తప్పదు. ఈ లోకంబునం గాని మఱి యేలోకంబునం గాని యెవని యొక్క చిత్తము చూపులతోం జేరి నామ రూపంబులు గల చిత్ర విచిత్ర రూపంబులనుం గాంచి వానియందుం



చిత్తము నిలుచునో, వానికి యావెంటనే బంధము తప్పక సంభవించును. ఎవనియొక్క చిత్తము, చూపులతోం జేరకయు, నామ రూపంబులు గల చిత్ర విచిత్రంబులను జూడకయు, వానియందలి మోహ భ్రాంతులకు లోంగకయు, బ్రహ్మమునందే సదా నిలిచి యుండునో యట్టివానికి వెంటనే మోక్షము తప్పక సంభవించును. ఇందుకు సందియంబు లేదు. నీవు తొల్లింటి వారి చరిత్రంబులను వినలేదా? హరిశ్చంద్రుండు సత్యవ్రత బిరుదునుం బొందియును ప్రారబ్ధ కర్మంబుల ననుభవించెను. శ్రీ రామచంద్రుండును ప్రారబ్ధ కర్మవశంబున రావణుండను రాక్షసునిచే భార్యనుం గోలుపోయి యలవిగాని దుఃఖంబుల ననుభవించెను. నీ తాతయైన ధర్మరాజు దాయాదుల వలన రాజ్యమునుం బోంగొట్టుకొని యడవులలోం జొచ్చి పడరాని కష్టముల ననుభవించెను. ఎవరికిని ననుభవము తప్పదు. అడవులయందు వర్తించుచుం, గందమూలఫల పర్ణంబులు నాహారంబుగాం గలిగిన వారైనను, బట్టణ పట్టెలయందు వర్తించుచు, షడ్రసయుక్తముగు నన్నమును దినుచుండు వారుగా నుండినను నెవరియొక్క చిత్తమును, గను చూపులును వస్తు రూపములందుం దగులునో వారికి బంధము తప్పదు. ఇట్లుండంగా మోహ భ్రాంశంబున మునింగియున్న యా భరతుం డెటులం ప్రారబ్ధ కర్మంబునుం దప్పించుకొనును. అతని చరిత్రంబును సాంగముగా వినుము.

ఆ భరతుఁడు శరీరమును మఱచి చెట్టుక్రిందనం బరుండి యుండఁగా, కొంతసేపటికి నాజింక యాదారిని గంతులు వేయుచు వచ్చుచుండి యా చెట్టుక్రిందనం బరుండిన తన యజమానునిం జూచి యతని దగ్గఱంజేరి యతని పెదవులను నేత్రములను నాకుచు, తనముఖమును నతని ముఖమునందుఁ జేర్చుచుఁ దన కొమ్ములను మృదువుగా నతనిం దాఁకించుచుఁ, బ్రక్కలను బరుండుచుఁ, జెవులయొద్ద కంఠధ్వనులు చేయుచుండిన, నా భరతుఁడు లేచి కూర్చుండి యా జింకనుం జూచి సంతసించుచు, దానిని తన హస్తములతోఁ బట్టుకొని ముద్దులాడుచు, నా ముద్దులజింకా! నీవు నన్నుం బాసి నేఁడెందుఁబోతివి? అకటా! నిన్ను వెదకి వెదకి వేసారి స్రుక్కి నిద్రించితిని, నీవిఁక నన్నుఁబాసి పోయినయెడల నీకు దుష్టమృగంబుల వలన నపాయము సంభవించునని పలికి మెల్లఁగా లేచి నడుచుచు, నా లేడిని వెంటం దీసుకొనిపోయి తన యాశ్రమంబుఁ జేరి, క్షుత్పిపాసలు దీర్చుకొని యథాప్రకారముగా సమాధులం జేయుచు, నా జింకను నేమఱక పెంచుచు, నెందునుం బోనియ్యక దారముతోఁ గట్టిపెట్టుచు, నది నానాట వృద్ధిబొందుటనుఁ జూచి సంతసించుచు, నిటులఁ గొన్నిదినంబులు జరిగిన, నొకనాఁ డా భరతరాజఋషి తన కంత్యకాలము సమీపించి యున్నదని తెలుసుకొని, యా జింకను ముద్దులాడుచు, నకటా! యీదిక్కులేని హరిణమును నే నిదివఱకుఁ బెంచి కాపాడి



పెద్దదానిఁగాఁ జేసితిని. ఇఁకమీఁద నీ ముద్దుల హరిణమునకు రక్షకులెవ్వరు? దైవమే దీనిని రక్షించునని పలికి కన్నీరునించి, ఓరీ ముద్దులజింకా! నాకు మరణకాలము సంభవించెను. నీ విఁకమీఁదట నీజాతి మృగములతోఁ జేరి వర్తించుము. దుష్టమృగముల వాతం బడక తప్పించుకొనుమనిపలికి దానియందుఁ బ్రేమను విడువక, చిత్తమును బ్రహ్మమునందు విశ్రాంతినిం బొందించక, ప్రాణవియోగమునుఁ జెందెనని చెప్పిన, నాయభిమన్యసూనుఁడు మిగుల విచారగ్రస్తుండై యా శుకబ్రహ్మమునకు నమస్కరించి, మహాత్మా! ముల్లోకంబుల మిగులఁ బావనుండును, కీర్తిశాలియుండును, ధీరుండునునగు నా భరతమహారాజు మోక్షమును బొందెనో! లేక మరల జన్మమెత్తెనో? ఆ పుణ్యపురుషుని వృత్తాంతమంతయు నాకు సాంగముగా వినుపించుమని వేఁడిన నా శుకమహాఋషి యిట్లు చెప్పం దొడంగెను.

భరతమహారాజు జింకజన్మమెత్తుట.

రాజేంద్రా! ఆ భరతుఁడు జింకపిల్ల సాంగత్యదోషంబువలనను, తన చిత్తమును గంటెమాఖ్యలను దట్టముగా నా జింకమీఁదనే పాఱుటచేతను, దానియందలి మోహపాశ భ్రమణంబులవలనను బంధంబులోఁ దగులుకొని, యాబంధమునుఁ దప్పించుకోలేక యొకయరణ్యంబున జింకగర్భంబున జింకయై పుట్టి, తన యోగవిజ్ఞానమహిమచేతను, నాత్మధ్యాన సంధానం దగుటచేతను,

తనేక జన్మసుకృత కర్మపాకంబు చేతను, దనకుఁ బూర్వ జ్ఞానము గలవాఁడై, తనదు విజ్ఞానంబునఁ దనకు సంభవించిన మృగజన్మమునుఁ దెలుసుకొని మిగుల దుఃఖమునుఁ బొంది, తనకుం గలిగిన జింకజన్మంబునకు రోయుచుఁ, దన మనంబున మిగుల విచారగ్రస్తుఁడై, యకటా! దైవము నా కిట్టిజన్మమును గలుగఁజేసెను, సర్వజన్మంబులకు నుత్తమంబగు మానవజన్మ మెత్తి రాజకులంబునం బుట్టి కీర్తిశాలుండనై భూమండల మంతయునుఁ బాలించి, యనేక రాజసూయాది యాగంబులు గావించి, దేవోత్తములను, భూదేవోత్తములను సంతుష్టినొందించి షడ్రసయుక్తమగు మృష్టాన్నంబులచే నాత్మసంతుష్టి నొందించి, ధర్మదేవతను నాలుగు పాదంబులతో వర్తింపం జేసి పవిత్రుండనై, విజ్ఞానదశనుం బొంది, వైరాగ్యపరుండనై, సర్వసంగ పరిత్యాగినై యరణ్యంబునకుం బోయి, యోగవిద్యా విలసితుండనై, సదా యాత్మారామధ్యాన తత్పరుండనై యున్న నాకు నీప్రారబ్ధకర్మం బిట్టుల సంభవించెను? హరిణసంగత దోషంబువలన నేనిట్టి జింకజన్మ మెత్తవలసి వచ్చెనుగదా! గతచింతనమునకి పగనం బనిలేదనియుఁ దనకుఁ బూర్వజ్ఞానంబుఁ గలిగి యుండుట దేవుని కృపయనియు యోచించి, చేయునదిలేక "యద్భావంతద్భవతి,,యను పెద్దల వాక్యమునకు విరుద్ధమేల గలుగును? నేననుభవించియే తీరవలయునని తన తల్లిపాలు ద్రావుచుఁ దనజన్మ స్వభావ చేష్టలన్నిటిని





మాని యీటుల నాలుగుమాసముల పర్యంతము తల్లి రొమ్ముద్దనే యుండి, పిమ్మటఁ దర్భలనింబాసి తన జాతి మృగంబులతోఁ జేరక యొంటరియై పుణ్య భూములయందుఁ దిరుగుచు, నాయడవిని విడిచి పులస్త్య పులహా మహా మునీంద్రులు వసియించెడు పుణ్యాశ్రమంబునకు వచ్చి, యా గండకీనదిలో దిగి స్నానముఁ జేయుచు, నా మహాత్ముల యాశ్రమంబులనుఁ జుట్టి తిరుగుచు, వారికి సాష్టాంగపడి నమస్కరించుచు, వారికి దూరముగానుండి వారు సంభాషించెడు, బింద, నాద, కూప, రూపాతీతంబులనెడు వేదాంత భావములను వినుచు, వానిని మఱవక తన మనంబున నిలుపుకొనుచు, నా మహాఋషులు పరిహరించిన భుక్త శేషములను గుడుచుచు, బ్రాహ్మణుండై పుట్టునటుల వివేకించుచు, రాత్రుల నాఋషుల యాశ్రమంబుననే పరుండుచు, మహాఋషులవలన వివిధ ధర్మంబుల నెఱుంగుచు, నండి రాలిన పర్ణములను భక్షించి గండకీనది జలంబును పానముఁ జేయుచు, నా మహాఋషుల యాశ్రమంబులకుఁ బ్రదక్షిణంబు గావించుచు, నెన్ని సంవత్సరంబు లీ జింకజన్మంబుతో నుండవలయునో యని, తన జన్మమును గుఱించి దుఃఖించుచుఁ ద్వరలో జన్మవిముక్తి కావలయునని దేవునిం బ్రార్థించుచు, నిటుల కాలము జరుపుచుండిన, నాజింక వర్తమాన మంతయు నా మహాఋషులు వారి దివ్యజ్ఞానంబున నెఱింగి యా భరతమహారాజునిం దలంచి విషాదమునుఁ బొంది చేయు



నది లేక యూరకుండిరి. అంత నా రాజఋషి తాను జింకనుఁ బెంచిన న్యాయమును, దానను జింకరూపముతోనే యుండి, పిమ్మట తన మరణకాలం బెఱింగి బ్రాహ్మణ యింటం బుట్టుటకై జన్మింప వలయునని తన మనంబున వివేకించి ప్రాణవియోగమునుం బొందెనని చెప్పిన నా నరేంద్రుండు విస్మయంబునొంది, మహాత్మా! యంతటి పుణ్య పురుషుండగు భరత మహారాజునకే ప్రారబ్ధకర్మ తప్పక జరిగి యుండఁగా, నావంటి వాని గతి యేమిగా జరుగునో తెలియదు, జనన భీతి మిగుల నన్నుఁ బాధించు చున్నది. నన్నుఁ గడతేర్పు భారము మీదని యని పెక్కు విధముల వినుతించి, మునీంద్రా! యా రాజఋషి జింక రూపమును విడిచి యే జన్మమునుఁ బొందెను. ఆయన వృత్తాంత మంతయును సాంగముగ వినుపింపుఁడని వేఁడిన, నా శుకమహాఋషి శ్రద్ధగా వినుమని యిట్లనియెను.

భరత మహారాజు బ్రాహ్మణుండై పుట్టుట.

రాజేంద్రా! మిగుల సుగుణాకరుండగు నా భరతుండు, నృపుల రాజ్యంబునకు సమీపమందుండు నగ్రహారంబున, వేదాంత విచారణాపరుండును, భగవద్భక్తుండును, సాకారధ్యాన నిరతుండును, కులాచార ధర్మంబుల చేవర్తించువాఁడును నగు, నంగీరసుండను బ్రాహ్మణునకు రెండవ భార్యయందు మగబిడ్డగా జన్మించెను. ఇటుల జన్మించిన యాబిడ్డ బ్రహ్మజ్ఞాని యగుటంజేసి,

యేడ్వకుండుటను జననీ జనకులును, బంధువులును వచ్చి చూచి యీబిడ్డ ప్రాణముతోనే యున్నాఁడు. ఏడ్వక యుండుటకు దోషమేమైన నుండునని యును, ఱెక్కఁగాఁ గండ్లు దెఱచి చూచుచుఁ గాలు సేతులు గదలించు చున్నాఁడనియును దలంచి, యనేకదేవతలకు మ్రొక్కుకొనినను, నాబిడ్డ యేడ్వక, చేసినను పాలను ద్రాగుచు, నోటిలో వ్రేలుపెట్టినం జీకుచుఁ, దల్లి చను బ్రాలు ద్రాగుచు, మలమూత్రములను విడుచుచు, నంతసేపు పాలియ్యకుండినను నూరకుండుచు, వేడిజలములఁతో స్నానముఁ జేయించు సమయంబునఁ గాని, కార సారములు ద్రాగించునప్పుడు గాని యేడ్వక యేమొక్క రోగముగాని నొప్పియుఁగాని లేక దినక్రమంబునం బెరుఁగుచుఁ, దనలోఁ దానుగా నవ్వుకొనుచు, సదా బ్రహ్మ మునుఁ జూచి యానందించుచుఁ, దల్లిదండ్రులు నవ్వఁ జూపినం జూచి నవ్వుచు, నిట్టుల నాలుమాసంబులు జరి గిన నాబిడ్డ దోఁగాడు చుండుటను, దనలోఁ దాను నవ్వుటలను, నిరుగుపొరుగు బంధువులు వచ్చి చూచి, యీబిడ్డను నెత్తుకొని ముద్దులాడుచు, నాశ్చర్యపడుచు, నితఁడు కేవల బ్రహ్మముగానే యుండునని పలువిధంబులఁ జెప్పుకొను చుండిరి. ఇట్లుండఁగా నాబిడ్డకు నాఱవ మా సంబున జననీ జనకు, లన్న ప్రాశనము సేయించి యన్నమునుఁ బెట్టుచుఁ, గూర్చుండఁ బెట్టుచు, లేచి నడిపించుచు, నమ్మా! నాయనా! యని చిన్న చిన్న



మాటలనుఁ జెప్పి, బిడ్డా! నీవును జెప్పుమనుచు, వారేమి చెప్పిన చిత్రపు మాటలకుఁ నానందించుచు, నతనికి దేవ శర్మయను నామకరణ మహోత్సవమునుఁ గావించి దేవ శర్మయని పిలువ నారంభించిన తల్లిదండ్రులనుఁ జూచి, యీభరతుఁడు, జననీ జనకులారా! నాపేరు దేవశర్మ కాదు, నా పేరు భరతుఁడు. మీరిక మీఁదట నన్ను భరతుం డని పిలిచినం బలుకుదునేగాని, లేకుండినఁ బలుకనని చెప్పిన, నా జననీ జనకులు మిగుల నద్భుతపరవశులై, యాహా! యిది యేమి వింతకార్యము. ఈబిడ్డఁడు తనపేరు తానే పెట్టుకొనెను. ఇట్టి వింత సమాచారము నెందైనను విని కని యెఱుంగము. ఇతఁడు త్రిమూర్తులలో నొక్కఁ డుగా నుండునో లేక బ్రహ్మజ్ఞానియైన మహాత్ముఁడుగా నుండునో మన భాగ్యవశంబున మనకుఁ బుత్రుఁడుగాఁ బుట్టెను. లేకుండిన నిట్టి వింతలు లోకంబునఁ గలవా యని, యొకరితో నొకరు చెప్పుకొని యాశ్చర్య మను చుండిరి. అంత నా భరతుఁడు తనకు నన్నము కావలె నని గాని దాహము కావలెనని గాని యడుగక, తల్లి పెట్టినయన్నమును దినుబండారములను దినుచు , పాలను నీరునుఁ ద్రావుచు, నది కావలెననియును, నిది వలదని యును:-జెప్పక, యేదియును జేతులలోఁ బట్టక, పెట్టి నది తినుచుఁ, దనంతటఁ దా నాడుకొనుచుఁ, దనలోఁ దాను నవ్వుకొను చుండుటనుఁ జూచి, వీఁడు పిచ్చివాఁ డగునేమో యని తల్లిదండ్రులు చింతించి, యకటా!

యిదియేమి వింతబిడ్డ మనకుం బుట్టెను. మనతో నయి నను జక్కఁగా భాషింపఁడు. ఎవ్వరేమి చెప్పినను మాటు పలుకఁడు. అయిదు సంవత్సరముల ప్రాయ మాయెనని తలంచించి యిరుగు పొరుగుబిడ్డలను బిలిచి, బిడ్డలారా! మీరు మా బిడ్డనితో నాడుకొనుండని వారి చేతికిఁ బప్పులు బెల్లాలు పండ్లునునిచ్చి యతని యొద్దకుం బంపిన, నా బాలు రతని దగ్గఱకుం బోయి వానినిం జూపించి, యన్నా! మన మాడుకొందము రమ్మని పిలిచిన నా భరతుఁడు వారినిం జూచి, యన్నలారా! నేను మీతోఁ జేరి యాడుకొనుట లేదు. నే నెవ్వరితోనుఁ జేరను. నేను సదా యొంటరివాఁడను. నాకుఁ దోడెవ్వ రును లేరు. నే సంపతీకిని సహాయుండను. నాయంతట నేనే యాడుకొనెదను. మీరు నాయొద్దకు రావలదని చెప్పి వారినిం బొమ్మనెను. ఈ వార్తలు తల్లివిని విచా రమునొంది, యతని దగ్గఱకుంబోయి యెత్తుకొని ముద్దు లాడుచు, నాయనా! నీ వెవ్వరితోనుఁ జేరి యాటలాడక నీయంతట నీవుగా నాడుకొనెదవు. ఆఁకలియని దాహమని యడుగవు. అన్నము పెట్టినం దినెదవు. నీ విచ్చినం ద్రాగెదవు. మాధుర్య భాష్యములనైన మాటల నడుగవు. నీ వెవ్వరినిం జూచి నీయంతట నీవుగా నవ్వెదవు? నీ వెవ్వ రినిం జూచి భాషించెదవు? నీ నిజవర్తమానమునుఁ జెప్పి నా శోకంపమును బుట్టించుమని పలికిన నా భరతుఁడు, తల్లీ! "మాయామయమిదమఖిలంజగత్-సర్వం మిథ్యేతి-



చింతయ-బ్రహ్మణో నాస్త్యత్యల్పంచన-కించన - తదేవాహం నసంశయః - తస్మిన్ ఏవాహం సదారమే. న దేహో౽హం నజీవో౽హం-నహంకార ప్రాణవర్గో-నమే మోహరాగాదిః- తదేవాహమస్మి" ఇత్యాది శ్రుతిస్మృత్యాది వాక్యరీతిగా సర్వమును మాయ. బ్రహ్మమునకంటె నేమియును లేదు. అదియే నాకు నాటపాటలు. నా కెందును భ్రాంతి లేదు. అభిమానము లేదు. నావలన మీకు సంతోషమే గాని చింతించవలసిన పనిలేదు. నే నెవ్వరిని బాధించను. ఏమియు నడుగను. ఏది పెట్టినను దిని బ్రహ్మానందుండనై యున్నాఁడ నని చెప్పెను. ఇటులఁ జెప్పిన బిడ్డయందుఁ దల్లికి లేశమైనను విరుద్ధమును దోఁచక యూరకుండెను. అంతట నాబిడ్డకు నేఁడవ సంవత్సరము పెట్టఁగానే తండ్రి శుభదిన నక్షత్రములుచూచి బిడ్డకు నక్షరాభ్యాసముఁ జేయించి, యాలుమానములు అచ్చులు హల్లులు చెప్పి యొకనాఁడు, బిడ్డా! నీకు నచ్చులును హల్లులును వచ్చె నా? సంస్కృతభాషకు నక్షరములెన్ని? అవి యెన్ని విధ ములు? అచ్చులెన్నో, హల్లులెన్నో చెప్పుమనిన నా భర తుఁడు, నాయనా! నీవు చెప్పుము, నేనునుఁ జెప్పెదనని స్పష్టముగాఁ దండ్రిచెప్పిన మాటలే చెప్పును గాని, వానిని జ్ఞప్తిలో నుంచుకొని తనంతటఁ దాను చెప్పలే కుండుటకుఁ దండ్రి కోపించి, ఓరిబిడ్డా! నిన్నుఁ గొట్టెద నని భయపెట్టి యతనిబుగ్గలు నులిమి చెప్పుమనినను పలుకఁడు. జ్ఞప్తి పెట్టుకొని వానిని జెప్ప నేరకుండుటను

జూచి, భార్యనుంబిలిచి, ఓయీ యిందుముఖీ! నీవిడ్డ నేమి చెప్పినను క్షితిలోనుంచక నేను చెప్పిన మాటలను మాత్రమే చెప్పుచున్నాఁడు. నే నెంతనిచెప్పి గాసిఁ బొందుదును. ఈ మొద్దువిడ్డకు విద్యనేర్పుటకు నావలనఁ గాదు. కొట్టుటకుఁ జేతులాడవు. ఏమి చేయవచ్చు ననిన నామె భర్తకు నమస్కరించి, పుణ్యాత్మా! ఇతఁడు బ్రహ్మజ్ఞాని గాని కేవల మనుజుండు గాఁడు. ఇతని చర్యలు మిగుల నద్భుతములు. ప్రపంచాది వృత్తి లేమియు నెఱుఁగఁడు. బ్రహ్మమయుండై యున్నాఁడు. ఇట్టి మహాత్ముఁడు మన పూర్వ పుణ్యవశంబున మనకుఁ బుత్రుఁడుగా జన్మించెను. దేవరవారు వీనిమీఁదం గోపింపఁగూడదని చెప్పెను. అందు కాబ్రాహ్మణుఁడు నీవు చెప్పిన దంతయు నిజముగా నుండునని భార్యతోం జెప్పి ప్రతి దినము రాత్రింబగళ్లు చదువుఁ జెప్పుచు నావిడ్డకు తొమ్మిదవ ప్రాయమురాఁగానే యతనికి వేదోక్తపుఁ గర్మ మనుష్ఠింపం జేసి, మెడలో గాయత్రి సూత్రమును వైచి, యతనికోట మంత్రమును జెప్పించుచు సదాచారక్రమంబులను నేర్పుచు, వేదాధ్యయనమునకుఁ జేయించుచు, మిగుల జాగరూకుఁడై విడ్డను రాత్రింబగళ్లు విచారించుకొనుచుండెను. ఆ భరతుఁడు "నిస్త్రైగుణ్యే పథి విచరతాం కోవిధిః కో నిషేధః" ఇత్యాది వాక్యముల రీతిని, విధి నిషేధములును, నీమ నిష్ఠలును నెఱుంగని బ్రహ్మజ్ఞాని యగుటచేత "నసుఖం వేదశాస్త్రేషు - నసుఖం మంత్ర యంత్రకే"



యను వాక్యములచేతఁ దానుసంధ్యావార్చకయు, జలముల బాధలు తీర్చుకొని జలము లపేక్షించకయు "సప్తకోటి మహామంత్రాః - చిత్తవిభ్రమ కారకాః" యను గురుగీతా వాక్యరీతిని, పంచాక్షరి, యష్టాక్షరి, గాయత్రి, మొదలగు సప్తకోటి మహామంత్రము లను చిత్తమునకు విశ్రాంతిఁ గలిగింప నేరవు. జనన మరణంబులను దప్పక పొందించునట్టివి. జన్మశూన్యమునకు నీ మాయామంత్ర తంత్రములు మార్గంబులు గావని తన మనంబున వివేకించి, తాను సంధ్యతోమకయు, నోరు గదుపకయు, గాయత్రి జపించకయు నుండుటను దల్లి యెఱింగి, తాను నతని సంధ్యతోమి నోరు గదుపుకొను నటులఁ జేసి యన్నము పెట్టుచుండెను. ఇటులఁ బదియారు సంవత్సరంబులు జరిగిన వాఁడు భరతుఁడు దీర్ఘకాయము గలవాఁడై చక్కఁగాఁ జయ్యనట్టి [illegible] శాంతుఁడై యుండుటను జూచి యా యంగీరసుఁడు తన మనంబున నితఁడు తపస్సిద్ధుఁడు, ప్రపంచమే యెఱుఁగని బ్రహ్మజ్ఞాని, యిట్టివానికి మనమెంత బోధించినను బ్రయోజనము లేదని వగచి, యతని యాకారమును, నతని ముఖమందుఁ బ్రకాశించెడు బ్రహ్మకళను జూచి యానందించుచు, కొన్నిదినంబులు జరిగిన వెనుక నా యంగీరసుఁడు కాలధర్మము నొందెను. అంతటఁ దల్లి పుత్రునింజూచి, బిడ్డా! నీవు లోకధర్మం బెఱుంగని కేవల బ్రహ్మస్వరూపుండవు. ఇఁక నీనాఁడు

నిన్నువ్వారు నీ నిజధర్మం బెఱింగి పోషింపఁగలరని మిగుల వగచి, మీ తండ్రితోఁడ నేనును సహగమన మయ్యెదను. నీ పినతల్లి, నీ యన్నలతోఁ జేరి యుండుమని చెప్పి యామె పురుషునితోడ సహగమనమునుఁ బొందెను. ఆ వధూవరు లిరువురు పుణ్యలోకంబునకుం జనిరి. పిమ్మట నా యంగీరసుని పెద్దభార్య పుత్రులు తండ్రికిఁ బరలోక క్రియలు గావించి, యా భరతునిం జూచి విధినిషేధ మీకు నిష్ఠ లెఱుంగని వెఱ్ఱివాఁడా! నీ వెద్దువలెఁ దిని, మొద్దువలెఁ బెరిగినావు. దురాచారుండవు, నీనిమిత్తముగాఁ దండ్రి ప్రయాసఁ బుచ్చుకొని, చేయింపఁగలనని తలంచక, నీకు ధర్మాచారంబు లెన్నివిధముల బోధించినను నీ వాచారధర్మంబు లెఱుంగవైతివి. లేశమంతైన రోషమునుఁ గాని, సిగ్గునుఁ గాని గలిగియుండవలె, మొలగుడ్డ తొలఁగిపోయినను బాగుచేయుకొనఁ నేరకున్నావు. అక్కటా! నీకు విద్యయును, గాయత్రియును, వేదాధ్యయనమును, రానందున చేతనే గదా మనతండ్రి మనంబున దుఃఖించి మరణించె నని పలికి, నీ కిఁకమీఁద నాచారధర్మంబు లెఱింగి నడచుకొనకుండిన నేము కొట్టుదు మని బెదరించి చెప్పిరి. అంత నా భరతుఁడు వారివలన లేశమంతైనను భయమును బొందక ప్రపంచము నెఱుంగక కేవల బ్రహ్మమయుండై యుండుటను, వజ్ఞాన స్వరూపు లగు నతని యన్నలు చూచి మిగులఁ గోపముఁ గలవారలై



తమతల్లినిం బిలిచి, యమ్మా! నీ వీ దురాచారునకు నన్నము పెట్టవలదని యామెకు దిట్టముఁ జేసి, ఛీ ఛీ! మానహీనా! యిల్లువిడిచి పొం డేనియుం బొమ్మని, మెడఁబట్టి నెట్టి బెత్తముతోఁ గొట్టిరి. అంత నా భరతుఁడు పూర్వజ్ఞాన వివేకంబున మానావమానములు, నిందాస్తుతులు, శరీరంబునకే గాని యాత్మకు లేవని తలంచి, తాను సర్వము నిండిన బ్రహ్మజ్ఞాని గనుకఁ దనయన్నల యందుఁ గొంచెమైనను నాయాసముఁ బొందక, తా నెందునుం బోక వారికొల్లు తిట్లనుభరించి వారు చెప్పిన పనులఁ జేయుచుఁ, పెద్దతల్లి పెట్టిన మాఁశన్నమును సహోత్రము మిగుల నిష్టముగా భుజించుచుఁ గొన్ని దినంబులు గడపిన, నొకనాఁడా యన్నలు వివేకశూన్యులై మొఱలఁగొట్టి బాధించిరి. ఆ భరతుఁడు తొలిజన్మమునందుఁ దన మనంబున వివేకించిన హింసభావమును, జనభావమును, రూపభావమును, రూపాతీతభావమును, నీ నాలుగింటిని, దనస్ఫురణకుం దెచ్చుకొని, (సోహం భావనాసక్తచిత్తమును, రూపభావంబగు చిందు స్వరూపమైన సర్వసాక్షియందు విశ్రాంతినిం బొందించి, తానే సంకల్పములు లేని యతితుండై, యచల పరిపూర్ణతను వహించి సర్వస్వాంత శూన్యుఁడై, కేవలాత్మ స్వరూపుఁడై, యిల్లువెడలిపోయి, తనకిష్టమైన ప్రదేశములఁ దిరుగుచు, భేదాభేదంబు లెంచక యా యుగ్రగాఢమును మూలస్థానమును నొకటిగా

అంత నా జడభరతుఁడు తన యన్నలు చెప్పిపోయిన ప్రకారం, బందుఁ గూర్చుండి తన నిజస్వరూపము నందే నిలిచినవాఁడై యితరచింత లేనియును లేక మహానందముతోఁ జేతులుకట్టుచుఁ, గొంత సేపు దేహమును మఱచి నిశ్చేష్టితుం డగుచుఁ, దనకుఁ దెచ్చిపెట్టిన యన్నమునుఁ గుడుచుచు, నీప్రకార మా చేనికిఁ గావలి యుండెను.

## వృషలమహారాజుచరిత్రము.

ఇట్లుండఁగా, నా దేశమును బాలించుచుండిన వృషలమహారాజు తనకు సంతానము లేనివాఁడై "అపుత్రస్య గతిర్నాస్తి" యను వాక్యప్రకారము, బిడ్డలు లేనివారికి స్వర్గాదిభోగంబులు లేవని పండితులద్వారా విని మిగులఁ జింతించి, యిందుకు నదుపాయ మేమని యా పండితులతో నాలోచించి, యనేక వ్రతముల ననుష్ఠించినను నన్నదానంబు లనేకంబులఁ జేయించినను, సంతానము కలుగనందున మిగుల వ్యసనముఁ బొంది, యతఁడు రాక్షసాంశ సంభూతుండుగావునఁ దన పురియందుండు భద్రకాళికిఁ బ్రతి సంవత్సరము ఫాల్గుణమాసంబునఁ బున్నమ దినంబునఁ బగలు పండ్రెండుఘంటలకు నరబలి పెట్టునటుల మనంబునఁ దీర్మానించుకొని, యిరువది సంవత్సరములు ప్రాయముగల యొక పురుష పశువును



దెప్పించి యొకసంవత్సరమువఱకు పారాలోనుంచి బాగా బలిసియుండు నటులఁ బోషించి, నాటిదినము బలిపెట్టుచు నిటులఁ బ్రతిసంవత్సరము బలిపెట్టునట్టి వాడుకగలిగియుండెను. ఇట్లుండఁగా నా సంవత్సరము పారాలోనున్న నరపశువు తన్ను భద్రకాళికి బలిపెట్టుదురని తలంచి, ప్రాణభీతినిఁ బొంది యా నుందునాటి రాత్రి పారాలోనుంచి తప్పించుకొని పాఱిపోయెను. ఆరాత్రి మహారాజునకు నాహారా బంభ్రాతు లా నరపశువుఁ గానకుంటచే మిగుల భయమును దేహకంపమునుఁ బొంది, యకటా! యీ వ్రతమానము మన ప్రభువునకుఁ దెలిసిన, మన ప్రాణములనుఁ దీయించును. మన మెటులఁ దప్పించుకోవచ్చును. మనము పోయి యా నరపశువును వెదకి కని పెట్టవలయునని యా నలుగురు భటులు పెనుముఖముతో మఱిఁగుప్తలంబులన్నిఁటినిఁ జుట్టిచూచి, నాలుగు ప్రక్కలకుం బోజ్ వెదకుచుండిరి, ఆభటులలోఁ బాపిగాఁడను భటుఁడొజొన్న చేనిలోపలఁ దూఱి పోవుచు నా మంచె క్రిందఁ దిన్నమీఁద పద్మాసనస్థుఁడై గూర్చుండి కేవల బ్రహ్మానందుండై యున్న యా జడభరతునిం గాంచి, తమ పారాలో నుండి తప్పించుకొని పోయిన నరపశువని భావించి, తన సందడిని వినిన నతఁడు పసిగిపోవునని తలంచి, యతని ప్రక్కఁ దిరిగితిరిగిచూచుచు; గొంత దూరము పోయి, ఓరిబీరా! ఆ దొంగవాఁడిందుఁ గూర్చున్నాఁడు మెల్లఁగా రారమ్ము. ఓరీ! అంకిగాఁడా! అప్రొవ్విన

వాఁడెందుఁ గూర్చున్నాఁడు. తొన్న చేరికి సంపడిచేయక వేగముగా రమ్ము. ఓరీ, యుల్లా! అదెయొక్కఁడీఁ డిందు గూర్చున్నాఁడు. సద్దుచేయక త్వరగా రమ్మని పిలిచి యా ముగ్గురు తన యొద్దకురాఁగానే, వారలుగురు నీక్షించి సంపడిసేయక మెల్లఁగా నతనిదగ్గఱకుఁబోయి, యామహాత్మునింబట్టుకొని గుట్టు తెలియక, పాతాళోఁదప్పించుకొనిన నరపశువని భావించి, యోరి దురాత్మా! యొక సంవత్సరము వఱకు మ్రదన యుక్తమైన యన్నమును, మధుమాంసములను, రుచిగలభక్ష్యములనుఁ దిని క్రొవ్వి మమ్ములను వంచించి పాతాళో నుండి తప్పించుకొని వచ్చి యిచటఁ గూర్చున్నావా? దేవుఁడు నేఁడు మాప్రాణములనుఁ దప్పించి మరల నిన్నుం జూపించెను. పాపీ! నిన్నుంజంపకేమము మిక్కిలి ప్రాణభీతినింబొందితిమి. తలమ్మని చంపలలోఁ తేటలతో గ్రుచ్చి తేవఁదీసి రారమ్మని నడిపించుకొనిపోయి, పాతాళోఁజేర్చి యందుఁ గావలియుండి తెల్లవాఱిన వెనుక, నా పలువురు నా పాతా గదిలోనికిం బోయి యందుఁ బద్మాసనముమీఁదం గూర్చుండి దేహమును మఱచి యాత్మానందమందై యున్న యా మహాత్మునింజూచి యా భటులు విస్మయమును నొంది, మనంబులఁ గలఁతఁ జెంది, యకటా! వీఁ డా నరపశువుగాఁడు. మనకు గుట్టు తెలియక యీ బ్రహ్మజ్ఞానిం బట్టుకొని



వచ్చితిమి. ఇందువలన మనకేమి యుపాధి సంభవించునో తెలియదు. మనకుఁ బ్రాణభయము తప్పెనని సంతోషపడుచుంటిమి. దేవుఁడు మనల నేమి చేయనున్నాఁడో తెలియదని యా నలుగురు కొంతసేపు చింతించి కొంత నడిపి ధైర్యముఁ జెప్పుకొని, యకటా! వీఁడెవ్వఁడైన మనకేమి? మనము చేయవలసిన కార్యములం జేయుదమని యొకరితో నొకరు చెప్పుకొనుచు. నన్నలారా! మనము భయపడవలసినది లేదు. వీఁ డెవ్వఁడో పిచ్చివాఁడుగా నుండును. లేదా, మూఁగ వాఁడుగా నైన నుండును. లేకుండిన యొడల మనము రమ్మని లేవఁదీయఁగానే మాట్లాడక లేచివచ్చునా? ఇటులఁ గూర్చుండియే నిద్రఁబోవునా? మనభద్రకాళికి మంచినరపశువే చిక్కెనని వారిలో వారు సంతోషించుచు, నయ్యో! నిద్రలే తమ్ముని యొకఁడు శిరస్సునకుఁ దైలమంటెను మఱి యొకఁడు దేహమునకుఁ జక్కఁగా నలుఁగుఁ బెట్టెను. ఇంతలో నొకఁడు జలమునుఁ జక్కఁగాఁ గాఁచెను. మఱి యొకఁడు స్నానముఁ జేయించి దేహమును శిరస్సునుఁ దుడిచి, నూతన వస్త్రములనుఁ గట్టి, దేహమంతయు సగరు గంధము నలఁది, ముఖమునందు శ్రీగంధమును, కుంకుమబొట్టునుఁ దీర్చి, పెంద్రుకలు గట్టి, శిఖయు ముడిచి, యా శిఖకు నెఱ్ఱని పుష్పదండలనుఁ జుట్టి, మెడలో నెఱ్ఱనిపుష్పహారములనువైచెను పిమ్మట నాజడభరతునకు మధుపర్కమిచ్చి, పీఠముమీఁదం గూర్చుండఁబెట్టి, మ్రదన

యుక్తమగు మృష్టాన్నమును, మాంస పదార్థంబుల తోడం గూడం బెట్టి, మధురములగు భక్ష్యములనుం దిన నిచ్చి, ధూపంబులొసంగి, కర్పూర హారతులెత్తి, భేరీ మృదంగాది పంచ వాద్యములు ఘోషింపంగా నతని వెంటం బెట్టుకొని పోయి పురవీధులయందుం ద్రిప్పుచు, మహోత్సవమున్ గావింపుచు నా భద్రకాళి గుడికిం దోడ్కొని పోయిరి. ఆ మహాత్ముండు తన గుడిలోనికి రాంగానే యా భద్రకాళి మిగుల భయపడి గడగడ వణంకుచు నతని జ్ఞానాగ్నికీలలు తన దేహమునకు నంటుకొని కాల్చుటచేత, నా భద్రకాళి యా యగ్నికీలలకు నిలువనోపక తత్తరించి భటాలున రాజు చేతిలోని పట్టాకత్తినిం బుచ్చుకొని, యా ప్రభువుం జూచి కంఠస్థ నెత్తం జేసి, ఓరీ దురాత్మా! ఇదివఱకు నజ్ఞాన స్వరూపులగు ద్విపాద పశువులను నాకు బలి పెట్టుచుంటివి. నేఁ డది తప్పించి మహాపురుషుండగు బ్రహ్మజ్ఞానినిం దెచ్చి నా యెదుట నిలిపితివి. ఈ మహాత్ముని జ్ఞానాగ్ని శిఖలు నన్నంటి బాధించుచున్నవి. లోకంబున మానవుండు బ్రహ్మజ్ఞానంబువలన దేవుండే యగుచున్నాండు. కావున నీవు వివేకశూన్యుండవై సర్వసాక్షి స్వరూపుండును, సర్వద్వంద్వశూన్యుండును, కేవలాత్ముండును నైన నీ మహాత్ముని ప్రభావమును వర్ణించి చెప్పుటకు నాకును బ్రహ్మాదులకును నలవిగాదు. ఇట్టి మహాత్మునియొక్క మహాప్రకృతికి నపాయము కలుగునేమో యని లోకంబు



లన్నియు గాబరగుచున్నవి. దిక్కులు ప్రతిధ్వను లిచ్చుచున్నవి. సూర్య చంద్రులు తలక్రిందు లగుచున్నారు. త్రిమూర్తులు సహా మూర్ఛలో మునింగిరి. జ్ఞానాగ్ని శిఖలు మింటికెగసి లోకములనుం గాల్చుచున్నవి. నా దేహమంతయు నగ్నిజ్వాల లంటుకొనెను. పాపీ! నేను భరియింపలేనని భూమినుండి యాకసమువఱకుం బెరిఁగి, చిందులుద్రొక్కి యాడుచు నా రాజు శిరస్సును ఛేదించి, యా శిరస్సును చేతిలో నుంచుకొని, యా మహాత్మునిం బట్టుకొని వచ్చిన భటుల శిరస్సులను నఱకి భూమి మీఁదం బడం ద్రోచి, యా భద్రకాళి యా మహాత్ముని యెదుట నృత్యము సలిపి యా కత్తినిం బాఱవైచి యతని పాదములమీఁద వ్రాలి, మహాత్మా! లోకరక్షకా! మీ ప్రభావమునుం దెలియుటకు నే నెంతటి దానను. పాపాత్ములు నశించిరి. నన్ను దయతో రక్షించి మీరు యథాప్రకారము జొన్నచేనికిం బొమ్మని ప్రార్థించెను. ఆ జడభరతుండు తన్ను భటులు తీసుకొనిపోవునప్పుడు గాని, తన్నుం బట్టుకొని వచ్చునప్పుడు గాని, గుడికిం దీసుకొని పోయినప్పుడు గాని, భద్రకాళి రాజు మొదలగు వారి తలలు నఱకినప్పుడు గాని, యేమియునుం బలుకక కేవల బ్రహ్మానందమునందే యుండి, యా భద్రకాళి ప్రార్థన నంగీకరించి యా గుడినుండి వెడలి యా జొన్నచేనికిం బోయి యథా ప్రకారము కూర్చుండెను. అంత నా భద్రకాళియును, తన యుగ్రము నణంచుకొని యథా

ప్రకారముగా నుండెను. ఇట్లుండఁగా నా జడభరతుఁడు జొన్న కంకులు నీనుచూకాలమున నా జొన్నచేనిలోఁ గావలి యుండుచుఁ, దక్కిన కాలములలోఁ దన యిష్ట ప్రకారము పట్టణమందును, పల్లెలయందును, నడవుల యందును పిశాచంబురీతిఁ దిరుగుచుఁ, దనకు లభించిన యన్నమును గాని, ఫలములను గాని, కాయలను గాని, కంద మూలాదులను గాని, పర్ణములను గాని, భుజి యించుచు, రుచియని యరుచియని యెంచుంగక, కేవల జడప్రాయుండై తిరుగుచు, జొన్నపంట కాలములలో వచ్చి యా చేనికిఁ గావలియుండెనని చెప్పిన నా పరీక్షి న్మహారాజు మిగుల సద్భుతము నొంది, మహాత్మా ? ఈ జడభరతోపాఖ్యానము మిగుల పావనము. ఎంతటి ఘోరపాపము లైనను హరింపఁ జేయును. ఈ మహాత్ముని యాపలి వృత్తాంత మంతయు సాంగముగా వినుపింపుఁ డని వేఁడిన, నా శుకమహాముని వినుమని యిట్లనియె.

సౌవీర మహారాజు చరిత్రము.

రాజేంద్రా ! సింధుదేశమును, బాలించెడు, సౌ వీరుం డనియును,రహూగణుం డనియును,నామములుగల యా నరేంద్రుండు,బహుకాలము రాజ్యమునుఁ బాలించి విసుకుఁజెంది, రాజ్యమునందును, శరీర సుఖమునందును, పత్నీ పుత్ర బంధువర్గంబుల యందును, మోహాదులు లేక, మోక్షాపేక్ష గలిగి మిగుల విరక్తినిం బొంది, యుత్తరసమున్నత ప్రవిష్టమంబున యోగసమాధి నిష్ఠాగరి



ష్టుండై యున్న కపిలమహామునిం జూడ్డకుఁ బోయి, యా మహాత్ముని కరుణకుఁ బాత్రుండవనై, యతని వలన జ్ఞానోపదేశమునుం బొంది మోక్షసంప్రాప్తుండ నగుదు నని యోచించి దీర్ఘవైరాగ్యమునుఁ బొంది, యొక్క దక్కన సంచలించలుగా బోయలను నియమించి తాను పల్లకిలోఁ గూర్చుండి యుత్తరపు దిక్కునకుఁ గూర్చి పోవు చుండెను. ఆ పల్లకి యా వృషలరాజ్యము మీఁదుగాఁ బోవుచుండా నరేంద్రుని పూర్వ పుణ్యవశంబున, నా పల్లకి యా జొన్నచేనికి సమీపముగా రాఁగానే, యా పల్లకి బోయలలో నొక్కనికి గస్తుకాలనొప్పి సంభవించిన, వాఁడా బాధకు సహింపనోపక పల్లకినిదించి భూమిమీఁదం బడి యేడ్చుచుండెను. తక్కిన బోయలు పల్లకిని దించిరి. పెద్దబోయి ప్రయాణము జరుగకపోయెనే. యేమి చేయ వచ్చునని, కొంతసేపు యోచించి యా సమీపమం దున్న జొన్నచేలలో నెవ్వరైనఁ గావలి యుందురని తలంచి, యా చేలలో వెదకుచుండఁగా, యందు సమాధి నిష్ఠాగరిష్ఠుండై కేవల బ్రహ్మానంద వ్యాపారుండై కూర్చుండియున్న యా జడభరతునిం గాంచి కాఁపు వాఁడని భావించి యతనిం బట్టుకొని శీఘ్రముగా లేవఁ దీసి, రా రమ్మని చేయుఁబట్టి వెంటఁ బెట్టుకొని పోయి, యా పల్లకిని శేవసత్తెఁ దుంచుప్రక్క నుండు పల్లకి దండెమును నతని భుజముమీఁదం బెట్టి, యువ్వా ! నీవును నీ బోయల తోడ నడుగులు వేయుచు, నడిచి రమ్మని పలికి యతని

నడిపించుచుండగాని పోవుచుండెను. ఆ జడభరతుఁడు కేవల
బ్రహ్మానందమయుండగుటం జేసి యా పెద్దబోయి చెప్పిన
మాటలను మనంబున నెంచక పల్లకీ భారమును లక్ష్య
పెట్టక తన కంటిముందు నాలుగు ప్రమాణ దూరం
బున దృష్టి నిలిపి దిగువ పల్లమనియును, మిట్ట యని
యును, యోచించక మెల్లమెల్లఁగా నడుచుచుం బోవు
చుండెను. ఆ జడభరతుఁడు మిగుల పొడవును, స్థూల
కాయుండును, నగుటం జేసి యా పల్లకీదండము తక్కిన
బోయల భుజములమీఁద నానక, నాపల్లకీ భారమంతయు,
నతని భుజముమీఁద మాత్రమే నిలిచి యుండెను. అందు
వలన నాపల్లకీ యిటునటుఁ గదలుచుఁ, దాఁటుమాఁటుగాఁ
బోవుటచేత నా ప్రభువునకు నాయాసము గలిగి మిగులఁ
గోపించి, యోరి పెద్దబోయీ! పల్లకీ యిట్లు విషమంబుగాఁ
బోవుటకుఁ గారణం బేమి. నా దేహమునకు మిగుల నా
యాసము గలుగుచున్నది. నీవు బోయల నదలించి
చక్కఁగా నడిపించరాదా యని పలికిన నా పెద్దబోయి,
ప్రభువునకు నమస్కరించి, స్వామీ! అటులఁ గావింతు
నని పలికి యా జడభరతునిం జూచి, యయ్యా! ప్రభువు
కోపించుచున్నాఁడు. నీవు చక్కఁగా నడుగులు వేయుచు,
మిట్టపల్లములఁ జూచి నడువుము. నీకు లేశమైనను భయము
లేక నీ యిష్టప్రకారముగా నడువవచ్చునా? యని వెక
రించి చెప్పినను, నామహాత్ముఁడు ప్రపంచధర్మం బెఱుంగని
వాఁడు గనుక యా బోయిచెప్పిన మాటలు తన చెవినిం



బెట్టక యథాప్రకారమే పోవుచుండెను. అంత నారాజు
దేహమునకు మిగుల నాయాసముకలిగిన నతఁడు కోపించి
పల్లకిని దింపించి పెద్దబోయినిం జూచి, మూర్ఖా! పల్లకీ
యిటుల తూఁగాడుచుం బోవుటకుఁ గారణమేమని యడు
గ నా పెద్దబోయి ప్రభువునకు నమస్కరించి, యయ్యా!
పల్లకీ బోయలలో నొకనికి, హఠాత్తుగా గర్భశూలనొప్పి
గలిగెను. వానికి బదులు వేఱొకని నియమించినాను.
వాఁడు క్రొత్తవాఁ డగుటచేతఁ జక్కఁగా నడువనందున
నీ పల్లకీ తూఁగాడుచున్నది. నేనేమి చేయువాఁడనని పలి
కిన, నా నరేంద్రుఁడు పెనుకోపముతో నా క్రొత్తవాఁ
డెవ్వఁడు? వాని నిటుల నా యెదుటికిం దెమ్మని పలికిన,
నా పెద్దబోయి యతనిం దెచ్చి ప్రభువు నెదుట నిలిపెను.
ఆ నరేంద్రుఁ డతని యాకారమునుఁ జూచి చిఱునగ
వుతో, యోరి నరాధమా! జీవన్మృతుఁడా! జడుఁడా!
నీకు బుద్ధిలేదా? ఇంతబలిసిన స్థూల దేహము బొడ
వును గలిగి యూఁబోతువలె నున్నావు, మిగుల దూరపు
త్రోవ నడిచి వచ్చుటచేత నీవు బడలికను గొంటివో?
లేక పల్లకీ భారమును మోయఁజాలక నలిసి స్రుక్కి
తివో? నాయాజ్ఞను మీఱి నడిచితివేని నిన్ను శిక్షింతు
నని రాజగర్వంబున గద్దించుచుఁ బ్రల్లదము లాడుచుం
బలికిన, నా జడభరతుఁడు చిఱునగవుతో నా నరేం
ద్రునిం జూచి, మానవేంద్రా! నీవు చెప్పినటుల స్థూల
దేహము గలిగి బలిసి యుండుట సత్యము. అయినను-

నాకు దేహము లేదు నేను పల్లకిని మోయలేదు; నాకు రాకపోకలు గలుగుటయును, నేను నడిచి వచ్చుటయును, పల్లకీ భారమువలన నేను బడలికను బొందుటయును; నివియన్నియు నబద్ధములు. నాకు నే కాలము నందును ప్రయాణముగాని, యలసటగాని, ప్రసుక్కుటలుగాని గలుగ నేరవు. నేను సదా రాకపోకలు లేని యశరీరుండను, నీవే వివేకముచేత నాకు స్థూలమగు బలిసిన కాయము గలదని పలికితివో తెలియదని పలికిన, నా నరేంద్రుం డద్భుతమునొంది, ఓహో! ఇదేటి యద్భుత వాక్యములు! నీవు ప్రత్యక్షముగా నాకంటి యెదుట నా పల్లకీని మోసియును మోయలే దంటివి, నడచి వచ్చియును నడచి రాలే దంటివి. నీకు శరీరము లేదంటివి ఇదేమి యబ్బుర వాక్యములు. నీవు మిగుల నబ్బురగాండవుగా నున్నావని పలికిన, నా బ్రాహ్మణుడు, మహారాజేంద్రా! నీవు శిబికలోనే యుండుటయును, నేను నీ భారమును మోయుటయును, రెండును నబ్బుర వాక్యములే గాని నిజముకాదు. ఎవ రెవరి భారముల నెవ రెవరు భరింతురో నీవు వివేకంబున నెఱింగితివా? నా కేకాలమందును స్థూలకాయంబు గాని, సూక్ష్మకాయంబు గాని, కారణకాయంబు గాని, మహాకారణ కాయంబు గాని, యీ నాలుగు దేహంబులును లేవు. సర్వ పరిపూర్ణుండను. సర్వస్వతంత్ర తేజా స్వరూపుండను. ఏ ధర్మములును లేని కేవలాత్ముండను. ఇట్టి వాడనగు నన్ను నీవు వివేకంబునం దెలియ నేరక,



నాకు స్థూలదేహంబు గలదంటివి నీ వాత్మధర్మంబును శరీర ధర్మమును జక్కగా నెఱుంగని కారణంబున నీ పలుకు భాషించితివి గాఁబోలును. వినుము. దేహము బలిసి స్థూలముగా నుండుటయును, బలువు లేక చిక్కి యుండుటయును, పలువిధంబులగు రోగంబులు గలిగి యుండుటయును, నాఁకలిగలుగుటయును, దాహమెత్తుట యును, సర్వ కోరికలు గలిగి యుండుటయును, భయము పుట్టుటయును, సర్వభ్రాంతులు గలుగుటయును, జచ్చుట యును, బుట్టుటయును, క్రోధావేశంబులు గలుగుట యును, మేల్కని యుండుటయును, గలగనుటయును, నిద్రించుటయును, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరంబులు గలుగుటయును, బ్రాహ్మణుండని క్షత్రియుండని, చండాలుండని చెప్పుటయును, బడలికలనుఁ బొందుటయును, ప్రసుక్కుటయును, శోషించుటయును, క్షీణించుటయును, వృద్ధి బొందుటయును, త్రిగుణంబులును, వివిధ భోగంబులును, ననుభవంబులును, జూచుట యును, జేయుటయును, నడుచుటయును, బలుకుటయును, నాగామిసంచిత ప్రారబ్ధ కర్మములు ప్రాప్తించుటయును నివి యన్నియును పాంచ భౌతికంబగు శరీర ధర్మంబులే గాని యాత్మ ధర్మంబులు గావు. ఇవి యన్నియును, శరీరంబుతోడం బుట్టి శరీరంబుతోడనే, నశించుచుండును. అట్టి యాత్మస్వరూపుండ నగు నాకు దేనితోను సంబంధము లేక యుండఁగా, నేను నీ పల్లకిని మోసితినని చెప్ప

ఎట్లు? మఱియును, పాదములయొక్క భారమును భూమియును, పిక్కలయొక్క భారమును పాదములును, మోకాళ్ల భారమును పిక్కలును, తొడల భారమును మోకాళ్లును, పిఱుదుల భారమును తొడలును, గడుపు భారమును గటి భారమును, రొమ్ముల భారమును గడుపును, భుజముల భారమును హృదయమును, శిరస్సుయొక్కయు నీ శిబికయొక్కయు భారములను భుజములును భరియించుచున్నవే గాని నేను భరియించిన వాఁడనుగాను. ఈ ప్రకార మొకరి భార మొకరు భరించుచుండఁగా నాత్మ స్వరూపుండ నగు నేను భరియించినాఁనని నీవు చెప్పుట శాస్త్రవిరుద్ధంబు. నిన్నును, నక్కన సమస్త జంతు సముదాయంబును, భూమి, జలము, అగ్ని, వాయు భూతంబులు మోయుచున్నవే గాని నిజముగా నేను మోయలేదు. సర్వ శరీరంబులకు శాంత శమదమాది సద్గుణంబులు పూర్వ జన్మములయొక్క ప్రారబ్ధ కర్మ పరిపాకంబువలనం గలుగుచుండును. ఈ కర్మ శరీరధర్మంబేగాని యాత్మ ధర్మంబుగాదు. ఇట్టి సుకర్మ దుష్కర్మములు రెండును భ్రాంతి మూలకంబులే గాని యాత్మ స్వరూపుండ నగు నాయందు నిజముగా నే భ్రాంతులును లేవు నాకు వికారము గాని త్రిగుణ సముదాయము గాని, హాని వృద్ధులుగాని లేక పరిపూర్ణుండనై నిండియున్న నన్ను నీశిక్ష యేమిచేయును. నాకేమి బాధఁ గలిగించును?



కావున నిట్టివాఁడనగు నాయందు నీశిక్ష నిరర్థకంబై పోవును. మఱియును, నన్ను బుద్ధిలేదాయని యడిగితివి? బుద్ధియనునది యాకాశము యొక్కయు నగ్నియొక్కయు సంబంధమగు నంతరింద్రియము. ఇది విధి నిషేధములను సదా పొందుచుండును. విధి నిషేధములు లేని బ్రహ్మమయుండ నగు నాకు బుద్ధిలేకుండుట సహజధర్మమే గాని విపరీతము గాదు. మఱియును, జీవన్మృతుండ నని పలికితివి. లోకంబున ధర్మార్థ కామంబులయందు వర్తించుచు దేహాభిమానముఁ గలిగి, నాయిల్లు నా రాజ్యము, నాధనము. నాభార్య, నా బిడ్డలని చెప్పుచు, నహంకార మమకారములతో దురభిమానులై నేను నేనని పలుకుచు, జనన మరణ ప్రవాహములలోఁ దగులుకొని, చచ్చుచుం బుట్టుచుండు వారే జీవన్మృతులు గాని సదా సర్వ ద్వంద్వ శూన్యుండనై చావుపుట్టుకలం బొరయక, యచల పరిపూర్ణసముద్రంబునై నిండియున్న నేను జీవన్మృతుండ నెట్లగుదు? మఱియును పరాధముండ వంటివి, లోకంబున శరీర మిట్టిదని, యాత్మ యిట్టిదని తెలియనేరక శరీరమే తానని భావించువారే పరాధములని చెప్పంబడుదురు. నేను శరీరధర్మమే తెలియని యాత్మ స్వరూపుండను గాన, నన్నిట్టుల పరాధముండని చెప్పవచ్చునా. నీ విన్నిమాటలు రాజ్య గర్వంబువలనను, వివేక శూన్యంబు వల్లనను మాట్లాడితివి నీవును నేనును, నక్కన భూతములును, నీ

శిబికా భారమును భరియించి యుండఁగా నాశరీరమునకే మాత్రం బీ శిబికాభారము గలుగు నెట్లు? నాకు భారము కలిగిన నీకును భారము గలిగి యుండును. ఈపల్లకి భూమి యందుండు పర్వత వృక్షంబులలో నెద్దానివలనం జేయఁ బడినదో నీ వెఱింగితివా? మానవుని కాలు చేతులు మొదలుగునవి దేనివలనం గలిగినవో నీ మనంబున చక్కఁగాఁ దెలిసికొనుమని పలికి, యా బ్రహ్మజ్ఞాని మౌనమును ధరియించి యెప్పటియట్ల యా శిబికను వహించి ప్రారబ్ధకర్మమును శరీర మనుభవించే కావలయునని తన మనంబునం దలంచి యా పల్లకి మోసుకొని పోవుచుండెను.

అంతే నా రాజేంద్రుని పూర్వజన్మ సుకృతంబు వలనను, కొంతమట్టుకు వేదాంత విచారణ గలిగియుండుట చేతను, నా జడభరతుని యమోఘంపు వాక్యంబులకుఁ దన మనంబున జ్ఞానోదయముగలిగి, యాహా! యీ స్థూలకాయుఁడు కేవల బ్రహ్మజ్ఞానియే గాని సామాన్యుఁడుగా నుండఁడు. ఇతని వాక్యంబు లమృత తుల్యంబులుగా నున్నవి. సామాన్యునివాచా బ్రహ్మతత్వం బెట్లు వచ్చును. ఇతఁడు తత్వవేత్తగానే యుండును. తెకండిన నా దేహమంతయు నగ్ని శిఖ లంటుకొని నట్లుల నాకు వేదనగలిగెను. ఇట్టి మహాత్మునివలనఁ బల్లకిని మోయించి పాపము నొడిఁగట్టుకొంటినని మిగుల భయమును, దత్తరపాటును బొంది, ఓహో మహాత్మా! బ్రహ్మ



స్వరూపా! దేవరవారి జ్ఞానాగ్ని నాకు వేదనఁ గలిగించుచున్నది. పల్లకిని నిలుపుమని ప్రార్థించి, యొలుఁగెత్తి యఱచినను నా యఱపు లా బ్రహ్మజ్ఞాని గమనింపక, తన యానందముతోనే పోవుటనుం జూచి, యా రాజు మిగుల భయవిహ్వలతనుఁ బొంది, దేహ పరితాపమునకుఁ దాళఁజాలక యా పల్లకిలోనుండి కుప్పించి భూమికిం దుమికి, యా మహాత్ముని పాదములమీఁదం బడి, యా పాదములను గట్టిగాఁ బట్టుకొని యనేక విధముల వినుతించిన, నాజడభరతుండు పల్లకినిడించి, రాజా! నీవేల నా పాదములనుఁ బట్టుకొంటివి? లే లెమ్మని పలికిన, నా నరేంద్రుఁడు లేచి నిలిచి యంజలి బద్ధుఁడై, ఓహో మహాత్మా! మీ రెవ్వరు? కేవల బ్రహ్మజ్ఞానులుగా నుందురు. మీ వాక్యంబు లమృత తుల్యంబులు. దేవరవారేమి కారణంబున నిట్టి వికారమైన జడస్వరూపంబునుఁ బొంది లోకంబునఁ జరించుచున్నారో తెలియదు. ఇట్టి యద్భుత స్వరూపులైన నిన్ను దురాత్ములైన నా పల్లకిబోయ లెట్లుఁ గొనివచ్చి పల్లకిని మోయించిరో తెలియదు. ఆ దురాత్ములట్ల మోయించిరేని, యజ్ఞానుండనైన నేను మిమ్ముం దెలియనేరకుండుట కేమి కారణమో తెలియదు. అకటా! నేను మహాపాపిని. రాజ్యగర్వంబున బ్రహ్మజ్ఞాన స్వరూపుండ వగు నిన్ను సామాన్యునిగా భావించి గద్దించి ప్రల్లదపు మాటలాడితిని. దురాత్ముండనైన నన్ను మీ కృపారస దృష్టినిం జూచి



సౌవీరమహారాజు సాష్టాంగపడుట. జడభరతుఁడు. తక్కినవారలు.



రక్షింపుఁడు. నేను సింధుదేశాధిపతిని. నాపేరు సౌవీరుఁడు. బహుకాలము రాజ్యమును బాలించుట వలన విరక్తినిం బొంది మోక్షాపేక్ష గలవాఁడనై, శ్రీమన్నారాయణాంశ సంభూతుండగు కపిల మహామునీంద్రునకుం బోవుచున్నాఁడను. నా పూర్వపుణ్యవశంబున నా కపిల మహామునియే, మీరుగా నుండి యిటుల వచ్చి నాకు దర్శన మిచ్చినటులఁ దోఁచుచున్నది. మహాత్మా! మీ మహిమను దెలియుటకు నే నెంతటివాఁడను. నేను గర్వంబున మీయెడఁ గావించిన పాపకృత్యంబుల కొఱకు దోషఫలంబులు నన్నుం బొందకుండు నటుల, నాయందు దయారసమునుం బొంది యట్టి తప్పిదములను క్షమించి నన్ను రక్షింపకుండిన నాకు దిక్కెవ్వరు? నే నెవరికిని భయపడువాఁడను గాను. ఆ యమధర్మరాజుయొక్క కాలదండంబునకైన వెఱఁగుపడను. ఆ శివదేవునియొక్క శూలాయుధంబునకైన జంకను. ఆ దేవేంద్రుని వజ్రాయుధంబునకైన వెరుకఁ దీయను. అగ్నికైనఁ జలింపను. సూర్యచంద్రులయొక్కయు వరుణదేవునియొక్కయు, కుబేరునియొక్కయు బాణంబులకైనను జడియను. దేవరవారి జ్ఞానాగ్ని మూఁడు లోకంబులను గాల్చి భస్మము గావించునని భయముచేతం దత్తరపడుచున్నాను. మహాత్మా! నేను మిగులం బాపసంపన్నుఁడను. అజ్ఞానుండను. దేవరవారు నన్నుఁ గరుణారస దృష్టినిం జూచి, దయారించి రక్షింప వలయునని

పెక్కు విధములఁ బ్రార్థించిన నా జడభరతుఁడు చిఱు నగవుతో నా రాజునుం గాంచి యిట్లనియె.

మానవేంద్రా! నా పేరు జడభరతుఁడు, బ్రాహ్మణుండను. ప్రపంచముతోటి పొత్తేమియును లేక యొంటరి వాఁడనై యున్నాను. నా యిప్పటి జన్మము యొక్కయుఁ, బూర్వజన్మము యొక్కయు, నంతకుముందు జన్మము యొక్కయు వృత్తాంతమంతయును సాంగముగా వినుమని వినిపించిన, నా సౌవీరుఁ డద్భుతమునొంది, మహాత్మా! యీ భూమండల మంతయు నేకచ్ఛత్రమునం బాలించి దిక్కులు ప్రతిధ్వనులిచ్చునటులఁ గీర్తివహించిన మహా పురుషుండ నగు మీవంటి వారికనే, ప్రారబ్ధ కర్మ వశ జనన మరణంబులఁ గలిగించి యుండఁగా, నావంటి యజ్ఞానులకుం గలుగు గతు లెట్టివో యెఱుంగనని పలికి సాష్టాంగముగ నమస్కరించి, మహాత్మా! నన్ను దయతో నాదరించి నాకు జ్ఞానమార్గమును బోధించి నన్నుఁ గడతేర్చుమని పెక్కువిధములఁ బ్రార్థించిన, నా జడభరతుం డతనియందు దయగలవాఁడై, నరేంద్రా! నా కీకాలమందును గోప తాపంబులు గలుగ నేరవు. నే నొక్కండనే యీ పదునాలుగు భువనములు నిండియున్నాను. నాకు రెండవది లేదు. అద్వితీయుండను. నీవు నిశ్చయుండవై జ్ఞాన మార్గమును వినుము. ఈ లోకంబునం గలుగు మానవు లజ్ఞానాంధకారంబునం జిక్కి ధర్మార్థ కామ మోక్షంబు లనెడు చతుర్విధ పురు



షార్థములలో మిగుల శ్రేష్ఠమగు మోక్షమును దలంపనం జెట్టక, యర్థమందును, కామమందును, మనస్సు గలవారలై శరీరమే తామనియును, తామే శరీరమని యును భావించి, దేహాభిమానులై, చచ్చుచుం బుట్టుచు, ఘోరములగు కర్మకృత్యము లనుభవించుచుందురే గాని యాత్మ స్వరూపుండగు సోహంభావమును భావనా సక్తులుగాక యుందురు. చిత్త పరిపాకము లేని మానవులు గాని, బ్రహ్మేంద్రాది దేవతలుగాని సోహమను మహా వాక్యమును దెలియుటకు సమర్థులుగారు. ఆ వాక్యమే గదా సర్వ పాపక్షయంబగు మోక్షంబు. నీ వేకాగ్రచిత్తం బున సోహమను మహా వాక్యమును ధరియించిన కొలఁదిఁ దప్పక మోక్షమునుఁ బొందుదువు. ఇందుకు సందియంబు లేదని పలికిన, నా సౌవీరుండు మిగుల వినయ భయ భక్తులు గలవాఁడై, స్వామీ! యట్టి సోహమను మహా వాక్యమును వేరైన నొక వస్తువునుం గూర్చి చెప్పవల యునో, లేక యాత్మనుఁ గూర్చి చెప్పవలయునో నాకు దయతో నెఱిఁగింపుఁడని ప్రార్థించిన నా జడభరతుండు, రాజా! సోహమను మహా వాక్యము నాత్మనుగూర్చియే చెప్పవలయును గాని, పృథ్వి మొదలగు పంచభూతము లను, బ్రహ్మేంద్రాది దేవతలను, దేహేంద్రియములనుఁ గూర్చి చెప్పఁ గూడదు. పరబ్రహ్మ స్వరూపమైన సోహ మను మహావాక్యమును వేఱుగాఁ జెప్పుటచేత భ్రాంతికే కారణంబగుఁ గాని నిజార్థమెఱుంగుటకుఁ గారణముగాదు.

ఈ సోహం భావమును జిహ్వయును, దవడలును, పెదవులును నీవాక్యం బంటునటులఁ జిత్తమునఁదా జపింప నలయునేగాని, తక్కిన యే యింద్రియంబులును జపింపనేరవు. అట్టి మహా వాక్యమును గర్మేంద్రియమగు నోటితో జపించుటచేత నాత్మధ్యానము కర్మయుక్తమై, కర్మమున కే కారణం బగును. జ్ఞానేంద్రియంబగు జిహ్వ సోహం భావమును ధరియించి ధ్యానించుటచేత నా ధ్యానము జ్ఞానయుక్తంబై మోక్షపద ప్రాప్తింబొందించును. ఇందుకు సందియంబులేదు. దవడలును, పెదవులును సోహమను మహా వాక్యంబునకు నాధారంబులుగావు సోహమే యాత్మ స్వరూపము గనుక దీనికి దేనితోను సంబంధములేదు. ఈవాక్యమే పిపీలికము మొదలుకొని బ్రహ్మపర్యంతముగా నుండు సర్వచైతన్యప్రాణులకు నాధారంబై నాటకరూపమై బ్రహ్మసూత్రంబై, యగోచరంబై యున్నది. కావునఁ గాలు చేతులు, నుదరము, హృదయము, శిరస్సును గల దేహములను, నాత్మయని భావించుట నీతిగాదు. కారణస్వరూపుఁడుండు నీలతోయదమునకు వేఱు రూపజనముల దూరంబున సర్వసాక్షిస్వరూపంబై వెలింగెను. ఆత్మారామునియందు సోహమను మహావాక్యము పుట్టి వచ్చుచున్నదేగాని యితరేంద్రియముల వలనఁ గలిగినది గాదు. అట్టి మహావాక్యమే సర్వలోకముల



కును, త్రిమూర్తులకును, తక్కిన సర్వప్రాణులకును నాధారంబు. ఇది జాగరణ, స్వప్న, సుషుప్తి, తుర్యము మొదలగు నాలుగవస్థల యందును, సదా యాధారంబై, కళాస్వరూపంబై, యాత్మారామంబై, సర్వజన శ్లాఘనీయంబై, ముముక్షుజనులకు మాతకోలమై విలసిల్లుచు, ద్రష్ట స్వరూపుండగు సర్వసాక్షిని సర్వంనఁ జేయుటకు బట్టుకొమ్మయై, యోగులకు నంచితోపాయ యందమై యున్నది. అట్టి యాత్మ స్వరూపుని దేహేంద్రియంబుల యందుఁ జెప్పఁగూడదు. మానవేంద్రా! ఈపల్లకిదారువో, చెట్టో తెలుసుకొంటివా? లోకంబునం గల ప్రజలు మనరాజు చెట్టెక్కి వచ్చుచున్నాఁడని దారువెక్కి వచ్చుచున్నాఁడని చెప్పినయెడల నావాక్యంబులు నీ మనంబునకు నింపితంబులుగా నుండవుగదా? పల్లకినెక్కి వచ్చుచున్నాఁడని చెప్పిన నామాటలు నీ మనంబునకు నింపితంబులుగా నుండును గదా! చెట్టు వలన దారువును, నాదారువువలనఁ బలకలును, నాపలకలవలన నీ పల్లకియును, గుర్చీలును, మేజాలును, బల్లలును, బీరువాలును, పెట్టెలును, దీపవలునుఁ జేయఁబడి, యాయారూప నామంబులతో వర్తించునటుల, దేహేంద్రియము లాత్మవలననే గలిగి, యాయారూప నామంబులతో వర్తించుటచేత, నా దేహేంద్రియముల నాత్మయని చెప్పఁగూడదు. శిబిక మొదలగు వస్తువులకు చెట్టనియును, దారువనియును చెప్పఁగూడదు.

లోకంబున నానావిధ నామరూపంబులు గల వస్తువుల కాయాకారములు గలిగేయున్నవి. కావున, రాజేంద్రా! పరబ్రహ్మ స్వరూపులైన పెద్దల యొక్కయు, త్రిమూర్తులు మొదలగు దేవతల యొక్కయు, చక్రవర్తులు మొదలగు మానవుల యొక్కయు, గామధేనువు మొదలగు పశువుల యొక్కయు, గరుత్మంతుడు మొదలగు పక్షుల యొక్కయు, దేహములన్నియు నాత్మయని చెప్పుట వివేకంబుగాదు. ఈచెప్పిన వికార దేహంబులన్నియుం బాంచ భౌతికంబులగు మాయా స్వరూపంబులు. రాజులును భటులును నశించి వారివారి ప్రారబ్ధకర్మంబుల చొప్పున, వేలు వేలు రూపంబులనుబొందుదురేగాని, మఱుజన్మంబున రాజు రాజుగాను, భటుడు భటుడు గాను బుట్టుటలేదు. దేహంబులకే బాల్యమును, యౌవనమును, వార్ధక్యమును, నీ దశలు స్వభావముగా గలుగునేగాని యాత్మస్వరూపుం డగు దేహికి బాల్య యౌవన వార్ధక్య దశలు గాని, మఱియే వికారంబులుగాని లేవు. మఱియును, లోకంబున ప్రజలకు రాజనియుం, దండ్రికిం గొడుకనియుం, దల్లికిం గూతురనియు, మగనికి భార్యయనియు, నత్తకుం గోడలనియుం జెప్పంబడు నీ వ్యవహార భేదము లన్నియు శరీరభేదంబులే గాని యాత్మ భేదంబులుగావు. ఆత్మ యొక స్వరూపుడు. అదియే సోహమను మహావాక్యము. నీవునీమనంబున వివేకించి చూడుమనిన నారాజేంద్రుడు



శరీర ధర్మమంతయును గ్రహించి, సోహమను మహావాక్యము తన మనంబునకు గోచరించ నందున, నా మహాత్మునకు నమస్కరించి, స్వామీ! దేవర వారు సెలవిచ్చిన సోహమను మహావాక్యము నా మనంబునకు బోధపడక యున్నది. నేను బరమార్థశ్రేయంబులను బొందగోరి మహా పురుషుం డగు కపిల మహాఋషిని గూర్చి పోవుచుంటిని. నాపూర్వజన్మ సుకృత పాకంబువలన దేవరవారు నాకు దర్శనమిచ్చితిరి. నేను ధన్యుండనైతిని, దేవరవారును నట్టి మహాపురుషులే గనుక, నన్ను శిష్యునిగాంగైకొని నాకుం బరమార్థశ్రేయంబులు చక్కగాబోధించి నామనోరథంబు నీడేర్పుండని వినుతించిన, నాజడభరతుం డిట్లనియె.

రాజేంద్రా! నీవు పరమార్థ శ్రేయంబులు గోరి కపిలమహా ఋషియొద్దకుం బోవుచున్నానని పలికితివి. నీవాక్యములు మిగుల వింతలుగానున్నవి. పరమార్థము శ్రేయముకాదు. శ్రేయము పరమార్థమును గాదు. ఈ రెంటికి నించుకేనియు సంబంధము లేదు. పరమార్థమనంగా=జననమరణములు లేని మోక్షము శ్రేయంబనంగా=జననమరణములు రెండునుగలబంధము. వానిని జక్కగా వినుము. వారివారి యిష్ట దేవతలను దలంచి పూజించి, ధ్యానించి, యాదేవతలవలనం బెక్కువరంబులు గొనుట శ్రేయ స్వరూపం బగు మాయామయంబే గాని, పర మార్థం బగు మోక్ష దాయ

కంబు గాదు. త్రిలోక రాజ్యాధిపత్యము కలుగుట శ్రేయ స్స్వరూపంబగు మాయామయంబే గాని, పరమార్థంబగు మోక్షదాయకంబుగాదు. నవఖండమండలాధిపత్యముగలిగి చక్రవర్తియై భూమండల మంతయును పాలించుట శ్రేయస్స్వరూపంబగు మాయామయంబేగాని, పరమార్థంబగు మోక్ష దాయకంబు గాదు. ధన ధాన్యంబులు సమృద్ధిగాఁ గలిగి యుండుట శ్రేయ స్స్వరూపంబగు మాయామయంబేగాని, పరమార్థంబగు మోక్షదాయకంబుగాదు. నవనిధులును, అష్టైశ్వర్యంబులును గలిగియుండుట శ్రేయస్స్వరూపంబగు మాయామయంబేగాని, పరమార్థంబగు మోక్ష దాయకంబుగాదు, సుందరులైన స్త్రీలతో భోగ విహారంబులు సలుపుట శ్రేయస్స్వరూపంబగు మాయా మయంబేగాని, పరమార్థంబగు మోక్షదాయకంబుగాదు. అశ్వమేధ, రాజసూయా ద్యధ్వరములు గావించుట శ్రేయస్స్వరూపంబగు మాయా మయంబేగాని, పరమార్థంబగు మోక్షదాయకంబు గాదు. గోభూ హిరణ్యవస్త్ర దానంబులం గావించుట శ్రేయ స్స్వరూపంబగు మాయామయంబే గాని, పరమార్థంబగు మోక్షదాయకంబుగాదు. ఈచెప్పినవన్నియు నింకను దేహసంబంధములగు నన్నియును వాని వానిఫలముల శుభాశుభంబుల ననుభవింపం జేయునట్టి కృతకృత్యంబులైన శ్రేయస్స్వరూపంబులగు మా



యా మయంబులేగాని, పరమార్థంబులగు మోక్షదాయకంబులు గావు. స్వర్గలోకంబును త్రిమూర్తుల లోకంబులును శ్రేయ స్స్వరూపంబులగు మాయా మయంబులే గాని పరమార్థంబులగు ముక్తి పదంబులుగావు. మంత్రములను జపించుట శ్రేయస్స్వరూపంబగు మాయా మయంబే గాని, పరమార్థంబగు మోక్షదాయకంబు గాదు. నాలుగు వేదంబులును, నాఱుశాస్త్రంబులును శ్రేయ స్స్వరూపంబులగు మాయా మయంబులే గాని, పరమార్థంబులగు మోక్షదాయకంబులు గావు. మఱియు, కార్య కారణంబులు రెండును శ్రేయ స్స్వరూపంబులగు మాయా మయంబులేగాని, పరమార్థంబులు గావు, మహాకారణ స్వరూపుండగు నాత్ముఁడే పరమార్థంబు. అదెట్లనఁగా వినుము. బంకమట్టిచేతఁ గుండలు చేయఁబడు చున్నవి. ఆకుండలే కార్య స్వరూపంబులు. ఆ బంకమన్నె కారణ స్వరూపముగా నున్నది. ఈ కార్య కారణ స్వరూపములగు బంకమట్టికిని కుండలకును నుపాధులు గలుగుచుండును. ఇవి యన్నియు భ్రాంతిరూపకంబులు, సోహమను మహావాక్యమే పరమార్థ తత్త్వంబు. అట్టి సోహమును నీచిత్తమునందుఁ జేర్చి ధ్యానంబు గావించితివేని, మాయా మయుండగు జీవుఁడు పరిత్యక్త జీవుండై పరమాత్మునుం బొంది జీవన్ముక్తుండగుటకు నేసందియమును లేదు. పరమార్థము గోరినవారికి శ్రేయంబును, శ్రేయమును గోరిన

వారికిఁ బరమార్థమును లభింపనేరవు. లోకంబునం గల మానవులు పరమార్థమగు మోక్షంబునే కోరవలయును గాని, శ్రేయస్సును గోరరాదు. శ్రేయస్సునుం గోరుటకంటెను హీనవస్తువ యెందును లేవు. ఈశ్రేయంబు ప్రారబ్ధకర్మంబులవలన తనంతటఁ దానుగా సంభవించి యనుభవనీయంబుగా నున్నది గావునఁ, గోరినఁ గలుగునట్టిదిగాను, గోరకుండినం బోవునట్టిదిగాను నుండ లేదు. కావున నీకోరిక నిష్ప్రయోజనంబు. పరమార్థ శ్రేయంబులకు సదా విరుద్ధంబేగాని, రెండును నొకటిగాఁ జేరి యుండవు. నీకుఁ బరమార్థంబే కావలయునో లేక శ్రేయస్స్వరూపంబే కావలయునో నీయిష్టమునుఁ జెప్పిన యెడల నీకు నిష్టసిద్ధినిం గలిగింతునని పలికిన, నా భావినుఁ డానందరస భరితుండై, స్వామీ! దివ్యపురుషా! నాకిదివఱకు నిది పరమార్థం బనియును, నిది శ్రేయస్స్వరూపంబనియును, వాని తారతమ్యంబులను దెలియని కారణంబున, నవి రెండును నొకటియని భావించి పలికితిని. ఇప్పుడు దేవరవారి యమృతవాక్యంబుల వలన నా రెంటియొక్కయు వ్యత్యాసంబు లెఱింగితిని. - నే నిదివఱకు ననేక జన్మంబులెత్తి ఘోరనరకంబులఁబుట్టుచుఁ జచ్చుచుంటిని. ఇఁకమీఁదను నాకు జన్మమేవలదు. దేవరవారు నా యజ్ఞాన వాక్యములను క్షమించి, నాకుఁ బరమార్థంబగు మోక్షమునే బోధించి, జననమరణ ప్రవాహమునుండి తప్పించు భారము మీయందున్నదని, యంజలి బద్ధుండై విన



తించిన, నా సుహోత్రుఁడు చిఱునగవుతో నతని నాదరించి దీవించి యతనిం దనకు నెదురుగాఁ గూర్చుండ నియమించి, యతని శిరంబునం దన హస్తముంచి యష్టాక్షరీ మంత్రమును జెప్పి యిట్లని బోధింపఁ దొడంగెను.





జడభరతుఁడు సౌవీరునకు బోధించిన

పిండభావము.

రాజేంద్రా ! శ్లో॥ పిండంతు కుండలీశక్తిః । పదం హంసముదాహృతం । రూపంబిందు రితిజ్ఞేయం । రూపాతీతం నిరంజనం॥ అనియును, శ్లో॥ పిండేముక్తాః పదేముక్తాః । రూపేముక్తా వరాననే । రూపాతీతే చయేముక్తాః । తేముక్తా నాత్రసంశయః॥ అని గురుగీతా వాక్యరీతిని, పిండభావమనియును, పదభావమనియును, రూపభావమనియును రూపాతీతభావమనియును, వేదాంతము చతుర్విధంబులగు ముఖ్యమైన మార్గంబులుగా నున్నది. ఈ నాలుగు భావములను గురుముఖంబున గ్రహించిన దేవమానవులు మాత్రము ముక్తిని బొందఁగలరేగాని తక్కినవారు తలక్రిందులుగా నిలిచి చలికి వానకు నెండకు నోర్చి యగ్ని మధ్యమున నిలుచుకొని యెంతటి కష్టములైన తపంబులు చేసినను ముక్తిని బొందఁజాలరు. కావున నీనాలుగు విధంబులలో నొకటియైన పిండభావమును బోధించెదను. శ్రద్ధగా వినుము. తొలుత, వనఁగా, నేమియును లేని యనాదికాలమందు, నామరూప రహితంబును, నవాఙ్మానస గోచరంబును, బట్టబయలునునై యిట్టిదట్టిదని నిర్దేశింపరాని యచల పరిపూర్ణ బ్రహ్మము స్వతస్సిద్ధమై నిండియుండెను. అట్టి యచల బ్రహ్మంబునందు వెలుకయనెడు జ్ఞానశక్తి తనంతటఁ



దానే పుట్టి నాదభావమునుం బొంది బిందుస్వరూపమై సర్వసాక్షియై వెలుంగుటచేత మహా జ్యోతియనియును, పరమాత్మ స్వరూపుం డనియును, చెప్పంబడు చున్నది. అట్టి జ్ఞానశక్తివలనఁ గుండలినీశక్తి భూత సముదాయంబును, కారణ పురుషుండును, జీకటియును, పంచమహాభూతంబులును గలిగి యీ ప్రపంచ శరీరంబు లాయెను. ఆవివర మెట్లనఁగా:—

౧॥ పంచమహాభూతంబులలో నొకటియైన యాకాశములోని యర్ధభాగము బ్రహ్మాండమునందు నిలిచి, తక్కిన యర్ధభాగము వికారమును బొంది తన నిజాంశముతోఁ గూడుటవలన జ్ఞానమనియును, వాయువుతోఁ జేరుటచేత మనస్సనియును, నగ్నితోఁ గూడుటచేత బుద్ధియనియును, జలముతోఁ గలియుటచేతఁ జిత్తమనియును, బృథివితో సంబంధించుటచేత నహంకార మనియును చెప్పంబడి, యీ యైదురూపంబు లాయెను. ఇవే యంతరింద్రియంబులు.

౨॥ రెండవదియైన వాయుభూతములోని యర్ధభాగము బ్రహ్మాండమునందు నిలిచి, తక్కిన యర్ధభాగము వికారమునుం బొంది తన నిజాంశమునుం గూడిన వ్యానవాయు వనియును, నాకాశముతోఁ గలసిన సమానవాయువనియును, నగ్నితోఁ జేరిన నుదానవాయు వనియును, జలముతోఁ మిశ్రమంబైనఁ బ్రాణవాయు వనియును, భూమితో సంబంధించిన నపాన వాయువనియును

చెప్పంబడి యీ యైదురూపంబు లాయెను. ఇవే పంచ ప్రాణములు.

౩॥ మూడవదియైన యగ్ని భూతములోని యర్థ భాగము బ్రహ్మాంశమునందు నిలిచి, తక్కిన యర్థభాగము వికారమును బొంది, తన నిజాంశమునుం గూడిన నేత్రేంద్రియంబనియును, నాకాశంబుతోఁ గలసిన శ్రోత్రేంద్రియం బనియును, వాయువుతోఁ జేరినఁ ద్వగింద్రియం బనియును, నుదకముతో సంబంధించిన జిహ్వేంద్రియం బనియును, బృథివితో మిశ్రమమైన ఘ్రాణేంద్రియం బనియును, జెప్పంబడి యీ యైదురూపంబు లాయెను. ఇవే జ్ఞానేంద్రియంబులు.

౪॥ నాలవదియైన యుదక భూతములోని యర్థ భాగము బ్రహ్మాంశమున నిలిచి,తక్కిన యర్థభాగము వికారమునుఁ బొంది, తన నిజాంశమునుం గూడిన రసనేంద్రియం బనియును, నాకాశముతోఁ గలసిన శబ్దంబనియును, వాయువుతోఁ జేరిన స్పర్శంబనియు, నగ్నితో సంగమంబైన రూపంబనియుఁ బృథివితోఁ జేరిన గంధం బనియును, జెప్పంబడి, యీ యైదురూపంబు లాయెను. ఇవే జ్ఞానేంద్రియములకు విషయంబులు. ఇవే పంచ తన్మాత్రలు.

౫॥ ఐదవదియైన పృథివి భూతంబులోని-అర్థభాగము బ్రహ్మాంశమున నిలిచి, తక్కిన యర్థభాగము వికారమునుఁ బొంది, తన నిజాంశంబునుం గలసినఁ బాయురింద్రియం



బగు గుదమనియును, నాకాశంబుతోఁ జేరిన వాగింద్రియం బనియును, వాయువుతోఁ గూడినఁ బాణేంద్రియం బనియును, నగ్నితో సంబంధించినఁ బాదేంద్రియం బనియును, నుదకముతో మిశ్రమంబైన గుహ్యేంద్రియం బనియును, జెప్పంబడి యీ యైదురూపంబు లాయెను. ఇవే కర్మేంద్రియంబులు.

ఇటులఁ గలిగిన జ్ఞాన, వ్యాన, నేత్ర, రస, పాయువు లగు నిజాంశంబు లైదును, సమష్టి భూతంబులని చెప్పంబడును. తక్కిన యిరువదియును, నితర భూతసంసర్గ జనకంబులు గావున, వ్యష్టిభూతంబు లనియును, జెప్పంబడును. ఈ యిరువదియైదు తత్వంబులును గూడి యీ పిండమాయెను.

ఆకాశతత్వ పంచకంబునకు నధిదేవతల వివరము.

జ్ఞానమునకు క్షేత్రపాలకుండును, మనస్సునకుఁ జంద్రుండును, బుద్ధికి బ్రహ్మయును, చిత్తమునకు విష్ణుండును, నహంకారమునకు రుద్రుండును నధిదేవతలు.

వాయువువలనం గలిగిన పంచప్రాణంబులకు నధిదేవతల వివరము. వ్యానవాయువునకు విజయుండును, సమాన వాయువునకు జయుండును,నుదానవాయువునకు విశ్వయోనియును, ప్రాణవాయువునకు విసృష్టును, నపానవాయువునకు విశ్వకర్తయును నధిదేవతలు.

అగ్నివలనఁ గలిగిన జ్ఞానేంద్రియంబు లైదింటికి అధ్యాత్మ, అధిభూత, అధిదేవతల వివరము.

చక్షువు - అధ్యాత్మ. రూపము - అధిభూతము. సూర్యుఁడు - అధిదేవత. శ్రోత్రము - అధ్యాత్మ. శబ్దము - అధిభూతము. దిక్కులు - అధిదేవతలు. త్వక్కు - అధ్యాత్మ. స్పర్శ - అధిభూతము. వాయువు - అధిదేవత. జిహ్వ - అధ్యాత్మ. రసము - అధిభూతము. వరుణుఁడు - అధిదేవత. ఘ్రాణము - అధ్యాత్మ, గంధము - అధిభూతము. అశ్వినీదేవతలు - అధిదేవతలు.

ఉదకము వలనం గలిగిన పంచతన్మాత్ర విషయంబులకు వివరము శ్రోత్రమునకు విషయము శబ్దము. త్వక్కునకు విషయము స్పర్శము. చక్షువునకు - విషయము రూపము. జిహ్వకు విషయము రసము. ఘ్రాణమునకు విషయము గంధము.

పృథివివలనం గలిగిన కర్మేంద్రియములైదింటికి. అధ్యాత్మ - అధిభూత - అధిదేవతల వివరము పాయువు - అధ్యాత్మ, మలవిసర్జనము - అధిభూతము, మృత్యువు - అధిదేవత. వాక్కు - అధ్యాత్మ, వచనం - అధిభూతము, అగ్నిదేవుం డధిదేవత. పాణి - అధ్యాత్మ, దానము - అధిభూతము, దేవేంద్రుఁ డధిదేవత పాదము - అధ్యాత్మ, గమనం బధిభూతము, విష్ణుదేవుం డధిదేవత. గుహ్యం బధ్యాత్మ. ఆనందం బధిభూతము. బ్రహ్మదేవుం డధిదేవత. ఈ యైదింటికి విషయంబుల వివరము. వాక్కునకు విషయము వచనము, పాణికి విషయము దానము, పాదమునకు విషయము గమనము, గుహ్యమునకు విషయ మానం



దము, పాయువునకు విషయము మలవిసర్జనము.

జ్ఞానమను తెలివి సమాన వాయువునుం గూడుకొని, శ్రోత్రేంద్రియము ద్వారా శబ్దమును గ్రహించి, వాగింద్రియము ద్వారా పదించుచున్నదే గాని, యాత్మ కాదు ఆత్మస్వరూపుఁడు మాట్లాడుచున్నాఁడని చెప్పుట వివేకంబు గాదు.

మనస్సు వ్యానవాయువునుం గూడుకొని, త్వగింద్రియము ద్వారా స్పర్శను దెలుసుకొని, పాణీంద్రియము ద్వారా యిచ్చి పుచ్చుకొనుచున్నదే గాని, యాత్మ కాదు ఆత్మస్వరూపుఁ డిచ్చి పుచ్చుకొనుచున్నాఁడని చెప్పుట వివేకము గాదు.

బుద్ధి యుదాన వాయువునుం గూడుకొని, చక్షురింద్రియము ద్వారా రూపమును గని తెలిసి, పాదేంద్రియము ద్వారా గమనాదులు చేయుచున్నదే గాని, యాత్మ కాదు. ఆత్మస్వరూపుఁడు నడుచుచున్నాఁడని చెప్పుట వివేకము గాదు.

చిత్తము ప్రాణవాయువునుం గూడుకొని, జిహ్వేంద్రియము ద్వారా రసమును గ్రహించి, గుహ్యేంద్రియము ద్వారా యానందించుచున్నదే గాని, యాత్మ కాదు. ఆత్మస్వరూపుఁడు భోగించి యానందించుచున్నాఁడని చెప్పుట వివేకంబు గాదు.

అహంకార మపాన వాయువునుం గూడుకొని ఘ్రాణేంద్రియము ద్వారా గంధమును గ్రహించి

హాయి మేంద్రియములద్వారా మలవిసర్జనము చేయుచున్న దేగాని, యాత్మ కాదు. ఆత్మస్వరూపుఁడు మలమును విడుచుచున్నాఁడని చెప్పుట వివేకము కాదు.

ఈ ప్రకారము పంచభూతంబుల వలనం గలిగిన సర్వేంద్రియంబులును నాయా యధిదేవత లాయా కార్యములను జరిగించుచున్న వేగాని, యాత్మస్వరూపుఁడు జరిగించుచున్నాఁడని చెప్పుట సరి కాదు. ఆత్మకు నే యింద్రియములతోను సంబంధము లేదు. పంచభూత స్వరూపమే బ్రహ్మాండము, పంచభూత వికారమే పిండాండము. ఇట్టి పిండములకు నాకాశోపత సంబంధుండగు చిత్స్వరూపుఁడే జీవుఁడు. ఈజీవుని సంకల్పంబు చేతనే, సంచిత ప్రారబ్ధకర్మంబులు గలిగి, మానవులు జన్మంబు లెత్తుచు, బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యములను బొందితమకొల్లెంటి ప్రారబ్ధకర్మంబుల ననుభవించి మరణించుచుందురు. జాగరణము, స్వప్నము, సుషుప్తి, తుర్యమను నీనాలుగవస్థలు జీవునకే గాని యాత్మకుఁ గాదు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములనెడు నీ పంచకోశంబులును జీవునకు సంబంధించినవే గాని యాత్మకు సంబంధించినవి కావు. రజోగుణము, తమోగుణము, సత్వగుణము. ఈ త్రిగుణంబులు జీవగుణంబులేగాని యాత్మకు నే గుణంబులును లేవు. అస్తి, జాయతే, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతే యనుషడ్విధ వికారంబులును, దశవిధ నాదంబులును నీ మొదలగునవన్నియును, గారణ



స్వరూపమగు కుండలిశక్తి యుక్తమైన పిండభావము తోనే చేరియున్నవిగాని యాత్మకు సంబంధించినవి గావు. మఱియును, రేచక పూరక కుంభకములు గావించి దశవిధ నాదములను బయటఁదీసి వానిని నాలకించిన మొదల నీకు బ్రహ్మానందసుఖము గలుగునని చెప్పి పంచాక్షరీ మంత్రము నుపదేశించి, యాధారాది మహాధారములను వివరించి చెప్పి, నీ చిత్తమును నాద బ్రహ్మానంద సుఖంబునందుఁ జొప్పించి యానందించుచుండుము. ఇదియే పిండభావము. ఈ యష్టాక్షరీ మంత్రమును, గురుముఖాలకముగా గ్రహించిన పుణ్యపురుషులకు, మాంసపిండము మంత్రపిండంబై సాలోక్యాది పదవులకుం బ్రాపించునని చెప్పిన నాసౌవీరుఁడు మిగుల సంతసించి, నాదానంద సుఖంబునం దేలుచుండెనని చెప్పిన, నా పరీక్షన్మహారాజు మిగుల నానంద భరితుండై శుకబ్రహ్మమునకు నమస్కరించి, మహాత్మా! దేవరవారి కటాక్షంబున నేను శరీరేంద్రియ సముదాయంబగు పిండభావముఁ జక్కఁగా గ్రహించితిని. ఆ జడభరతుండు సౌవీర మహారాజునకుం బోధించిన పదభావ మంత్రయును నాకు సాంగముగా నెఱిఁగింపుఁడని వేఁడిన నా శుకమహాముని యిట్లని చెప్పందొడంగెను. ఆ సౌవీరుఁ డా జడభరతునింగాంచి, మహాత్మా! దేవరవారి కటాక్షంబునఁ బిండభావ మంత్రయును గ్రహించితిని. పవిత్రుండనైతిని, పదభావముఁ బోధించి

నన్ను మోక్షాయత్తునిగాఁ జేయుఁడని ప్రార్థించిన, నా జడభరతుం డిట్లనియె.

### జడభరతుండు సౌవీరునకు బోధించిన పదభావము.

మానవపుత్రా! "పదం హంస ముదాహృతం" అను గురుగీతావాక్యరీతిని, పదమనఁగా = హంస పదము. ఇదియే సోహమను మహావాక్యము ఇది యే యుపనిషత్తు. ఇదియే యహం బ్రహ్మాస్మి. ఇదియే యద్వైతము. ఇదియే యాత్మ. ఇదియే ప్రణవాక్షర ద్వయము. ఇదియే సప్తకోటి మహామంత్రములకు మూలమంత్రము. ఇదియే బ్రహ్మసూత్రము. ఇది యే యాత్మారామమంత్రము. ఇదియే తారకమంత్రము. ఇదియే జ్ఞానము. ఇదియే మోక్షము. ఇదియేసర్వలోక ములకు నాధారము. ఇంతకంటెను దొడ్డవాక్య మెం దును లేదు. గాయత్రి మొదలగు సప్తకోటి మహామంత్ర ములు దీనికి సమానములు గావు. ఇది పిపీలికము మొద లుకొని బ్రహ్మ పర్యంతముగాఁ గల్గు సర్వశరీరములకు నాత్మస్వరూపంబై, యాధార, స్వాధిష్ఠ, మణిపూరకా నాహత, విశుద్ధాజ్ఞేయంబు లనెడు షడాధారము లను జుట్టుకొని సదా తిరుగుచు నిడా పింగళల యందు వెలిసంచారమును, సుషుమ్నా నాళమందు లోవ్యాప కమును గలిగియుండును. ఇది లేకుండిన సర్వశరీరంబు



లును, సర్వలోకంబులును శూన్యంబులగును. ఈ యుప నిషద్వాక్యమే నిరామయుండగు బ్రహ్మనిలయమునుఁ జూపించునట్టిది. ఈ యుపనిషద్వాక్యమే సర్వ ముముక్షు వులకు నూతకోలయై యున్నది. ఇదియే సర్వయోగము లకు నాధారంబు. ఇదియే సర్వేష్టసిద్ధులను బొందిం చునది. ఇదియే కళాస్వరూపము ఇదియే మంగళ ప్రదం బు ఇట్టి తారక రామమంత్రముయొక్క యారోహ ణావరోహణంబులవలన వెలువడిన, ప్రణవాక్షర ద్వయ మును నీ చిత్తమునందుఁ గూర్చి పెదవులను బంధించి మౌనమును ధరియించి సదా జపించుచుండుము. అం దువలన నీ చిత్తేంద్రియము మితరేంద్రియములతోఁ జేరక యాత్మధ్యాన నిరతుండవై జపించుచుండుము. ఇట్లు జపించుటచేత జీవుఁడు హంసునితోఁ సుషుమ్నానాళంబు లోఁజొచ్చి బ్రహ్మస్థానంబునందుఁ దిరుగుటచేత, నాచిత్త మునకు సంకల్పాది గుణంబులు శూన్యమై, యాహంసు నియందుఁ జిత్తవిశ్రాంతిని బొందుచు, నీలతోయద మందు సునీలరూపుండగు తేజస్స్వరూపమందుఁ గలసి, యచట మనోమారుతంబు లొకటిగాఁ గూడి మహాకార మగు స్వరూపంబగు నాదజ్యోతితోఁ గలియును. ఇట్లుఁ గలియుటే జీవేశ్వరైక్యంబు. ఇదియే జీవన్ముక్తి. ఇది యే మోక్షము. ఇదియే శాశ్వత సుఖానందంబని, పద భావమంతయును బోధించి, సోహంభావనాసక్తచిత్తునిఁ గాఁ జేసిన, నా నరేంద్రుండు నద్భుతమునొంది, మహాత్మా!

నావలె సోహం భావనాసక్తచిత్తుడై మోక్షమును బొందిన తొల్లింటివారి చరిత్రమును జెప్పి నా మనంబునకుం గృతకృత్య సిద్ధులను గావింపుమని ప్రార్థించిన, నా జడభరతుండు రాజా! తొల్లి ఋభుమహర్షి నిదాఘునకుం బోధించిన తత్త్వోపదేశ ప్రకారంబంతయు వినుమని యిట్లనియె.

మానసపుత్రా! తొల్లి బ్రహ్మపుత్రుండగు ఋభుండను మహాఋషి తనదు బాల్యదశ మొదలుకొని నానుగామాత్మకంబగు ప్రపంచ వృత్తుల యందు నిష్టము లేనివాడై యెద్దియు నపేక్షింపక, లేశమైనను శరీరాభిమానములు లేక మోహపాశరహితుండై పెద్దల వలన శ్రవణాదులు గలిగి వర్తించుచుఁ దన తండ్రియగు చతుర్ముఖ బ్రహ్మవలన బ్రహ్మవిద్యను సాంగముగా గ్రహించి, సదా బ్రహ్మమయుండై వర్తించుచుండెను. ఇట్లుండఁగాఁ బులస్త్య బ్రహ్మపుత్రుండగు నిదాఘుండను వాఁడా ఋభునిం గాంచి యా మహాత్ముని పాదములకు సాష్టాంగ నమస్కారములు గావించి, ఓ తత్త్వస్వరూపా! మిగుల జడుండనగు నాకుఁ దత్త్వోపదేశముం జేసి శాశ్వత సుఖానందమగు మోక్షమును గటాక్షించుమని వినుతించి, తనదు వృత్తాంతమును జననీ జనకులకు జెప్పిన, నా బ్రహ్మవేత్త యతని నాదరించి యతనిం దనకు శిష్యునిఁగాఁ జేసి యిట్లని బోధింపం దొడంగెను.







నిదాఘుఁడు. ఋభుమహాఋషి.

ఋభుమహాఋషి నిదాఘునకుఁ
దత్త్వోపదేశంబు సేయుట.

మానసపుత్రా! నీవు మిగుల శ్రద్ధాళుండవై తత్త్వమార్గ మంతయుఁ జక్కఁగా వినుమని యతనికిఁ బింద భావముగ సాంఖ్య శాస్త్ర మంతయును సాంగముగా వినిపించి తత్త్వమంతయుం దేటపడం జెప్పి యద్వైతమార్గం బొక్కటితప్ప· దక్కిన తత్త్వమార్గ మంతయుఁ జక్కఁగా బోధించి, యో శిష్యరత్నమా! నీవు తత్త్వస్వరూపుండవైతివి. సద్గురుని మంత్రమును గాని, సద్గురుపదముగాని సదా మఱవక, నీ మనంబున

నిలుపుకొని యనుష్ఠానపరుండవై నీ యిష్టప్రకారము బ్రహ్మచర్యాశ్రమంబుంగాని, లేక గృహస్థాశ్రమంబుం గాని యవలంబించి సుఖివై యుండు మని దీవించి యంపెను. అంత నా నిదాఘుండు సద్గురుని యాజ్ఞప్రకారము, సకలసద్గుణ శీలవతియగు నొక కన్నియను వివాహముచేసుకొని, సరస్వతీనదికిఁ బ్రాంతమున వరిడుచు, పులస్త్య మహాముని యాశ్రమంబునకు సమీపమందున్నను వీరడు, వీరనగరమను పట్టణంబునం దుపవనంబున, నొక కుటీరమును గావించుకొని తాను తన భార్యయుఁ గాపురముండి, సద్గురుని వాక్య ప్రకారము గృహస్థ ధర్మంబుల నడుపుచు, నతిథియభ్యాగతులను విచారించుచు, నీ ప్రకారము పరమార్థ చింతనఁ గల వాఁడై సుఖించుచుండెను. ఇట్లుండఁగా నూఱుసంవత్సరంబులు గడచిన, నొక నాఁ డా ఋభుమహాముని తనదు శిష్యుఁడైన నిదాఘునకు సద్వైతసిద్ధినిం దెలుపఁ గోరి యచటికిం బోయి యతని యింటిబైట నిలుచుండెను. అంతనా నిదాఘుండు వైశ్వదేవ బలిహరణార్థంబు ఫలంబులు దే నుద్దేశించి, యాయింటిలోనుండి బైటికి వచ్చి, యందు నిలిచియున్న యా ఋభునింగాంచి తన గురుండని దెలియనేరక, యాఁకలిగొనివచ్చిన యతిథిగా భావించి యత్యంతాదరంబుతో నతని లోపలికి వెంటఁబెట్టుకొనిపోయి యుచితాసనంబునఁ గూర్చుండఁ బెట్టి యర్ఘ్య పాద్యాది విధుల చేతం బూజించి, స్వామీ!



మీరు బడలికతో నున్నట్లున్నది, భోజనము సిద్ధమైనది, దేవరవా రారగింపవలెనని పలికిన నాఋభుఁడు నిదాఘునింగాంచి యిట్లనియె. అప్పా! నా కేకాలమందును కుత్సితాన్నంబుల మీఁద మనంబు పోవుట లేదు కావున నేమేమి పదార్థంబుల సిద్ధము చేయించి యున్నావో చెప్పు మనిన, నానిదాఘుం డిట్లనియె. స్వామీ! ప్రస్తుతమందు మాయింట సిద్ధముగాఁ గమ్మని వాసనలు గల యతిరసంబులును, మినుప వడలును, దోసెలును, [illegible] గోధుమపిండితోఁ జేయఁబడిన కొన్ని పిండివంటలును గలవని చెప్పెను. ఆ ఋభుఁ డతనింగాంచి, యప్పా! నీ విప్పుడుచెప్పిన భక్ష్యంబు లన్నియు మధురంబులై యుండినను మ్రదసయుక్తముగు మృష్టాన్నంబునకు సమానంబులుగావు. కావున మ్రదసయుక్తముగు మృష్టాన్నమును సిద్ధము చేయించ కుండిన నేను గుడుచుట లేదని పలికిన, నానిదాఘుఁడు తనభార్యనుంజూచి, ప్రాణనాయకీ! నీవు శీఘ్రముగా మ్రదసయుక్తముగు నన్నమును గూరలను శాకము చేయుమని యాజ్ఞాపించిన, నాకంజదళాక్షి మంచిదని యతిశీఘ్రముగా నన్నమును గూరలను జిత్రముగా వండి తన ప్రాణనాథునకును, నామహాత్మునకును గుడువం బెట్టిన నా యిరువురును భుజియించి స్వస్థచిత్తులై కూర్చుండిరి. అంతనా నిదాఘుండు లేచి వినయ కట్టనం బుచ్చుకొని యా మహాత్మునకు వినయము నిట్లనియె.

అయ్యా ! భోజనకాల మతిక్రమించెను, మీరు మిగుల నాఁకలిఁగొంటిరి, మృదునయుక్తమగు మృష్టాన్నంబుల చేత మీకుంగల యాఁకలిఁకలు తీఱిపోయెనా ? సంతోషం బాయెనా ? తృప్తిం బొందితిరా ? దేనివారిం దుండి వచ్చితిరి ? ఎచ్చటికిం బోయెదరు ? మీరుండు నిలయ మెచ్చట ? చెప్పుఁడని యడిగిన, నాఋభుఁడు చిఱునగవుతో నానిదాఘునింజూచి యిట్లనియె.

ఓయినిదాఘా ! వినుము. ఈ లోకంబున నుండు మానవులు మిగుల నాఁకలినిం బొంది మృదునయుక్తమగు మృష్టాన్నమును భుజియించినయెడల వారలకుఁ దృప్తియును జిత్తానందమును గలుగునేగాని, నావంటి వానికిఁగాదు. నా కేకాలమందును నాఁకలిగాని దప్పిగాని లేకుండును. అట్టివాఁడనగు నన్ను నిట్లడిగితివి. మఱియును, నాఁకలి దప్పులు రెండును భూమివలనం గలిగిన ధాతుపదార్థంబులై యుండుటంబట్టి, యారెంటిని శరీరమందుండెడు జఠరాగ్నియే కాల్చి భస్మము చేయును. పులస్త్యనందనా! ఆఁకలియును, దాహమును నీరెండును దేహధర్మములుగాని యాత్మధర్మములుగావు, కాఁబట్టి యిట్టి వికారంబులు నాకు ముందుగాని, యిప్పుడుగాని, యింకమీఁదుగాని కలుగనేరవు. మఱియును, నాత్మస్వరూపుండనైన నాకు సదాకాలము తృప్తియు, నానందమేగాని, యేకాలమందును నాకుఁ దృప్తిలేకయుండుట లేదు. తృప్తియును, నతృప్తియును, నీ రెంటివలనం



గలిగెడు సుఖమును దుఃఖమును నివి రెండును చిత్తమునయొక్క ధర్మములు. నా కేకాలమందును నట్టి చిత్తధర్మము కలుగనేరదు. విశేషముగాఁ జిత్తచాంచల్యము గలవారి నడిగితివేని, వారు నీకు క్షుత్పిపాసలవలనం గలిగిన తృప్తియును, నందుపైఁ గలిగిన సుఖమును జెప్పుదురేగాని, సదాచిత్త విశ్రాంతినిం బొందియున్న నే నెట్లు వానింగూర్చి చెప్పనేర్తు ? సుబ్రహ్మస్వరూపుండనగు నాకీవికారంబు లన్నియు లేవు. నేను సదా నిర్వికారుండనయ్యే యున్నాను. ఈలోకంబున నాత్మతత్వజ్ఞానులందఱు సర్వకాలము నాకాశంబునట్ల పరిపూర్ణులై నిండియుందురు. నీ వాత్మధర్మం బెఱుంగక మాట్లాడితివి. నేను నడచివచ్చుటయు నడచిపోవుటయు లేదు. ఏకాలమందును నాకు రాకపోకలు లేవు. సదా కేవలాత్ముండనై యున్నాఁడను. నీవు వివేకంబునం దెలుసుకొనుము. ఈలోకంబున నీవును నీవంటివారుగొందఱును నిశ్చయముగా నీ తత్వజ్ఞానమునకుం దగినవారుకారు, మఱియును, నేనును, నావంటివారు గొందఱును సోహమను మహావాక్యము నూహచేసి, చిత్తమునందు భావనా సక్తులము గాక యుందుము. ఎంతటివారికిని నీ తత్వబోధ మిగుల దుస్తరము. అన్నముయొక్క మృష్టామృష్ట భేదంబులు నాకుం దెలియక నీ వలనం దెలుసుకొనుటకై నిన్నడిగితిని. భ్రాంతిస్వభావకంబులైన యాకారంబులకు మృష్టాన్నం బమృష్టాన్నంబుగా నగును.

అమృష్టాన్నము మృష్టాన్నంబుగా నగును. వీనివలన నాయీ శరీరంబులకు సుఖమును దుఃఖమును గలుగు చుండును. మృష్టాన్నమనఁగా మధుర యుక్తమగు భోజనము. అమృష్టాన్న మనఁగా మధుర యుక్తము కానిభోజనము. ఈరెండునుశరీరధర్మంబులై శరీరము లకు సుఖమును దుఃఖమును గలిగించుచుండును. అది యెట్లనఁగా: మంటిగోడలకు బంకమన్ను దట్టముగాఁ గలిపి పూయుటవలన నామంటిగోడలకు నెటుల దృఢత్వము కలుగునో, యటువలెనే శరీరంబులకు మృష్టానం బులు దృఢత్వమును బొందించునే గాని యాత్మనుం బోషింపఁ జాలవు. ఆత్మయేకాలమందును వీనితోసం బంధించినదికాదు. కావున నీవు మృష్టామృష్ట విచార ములనువిడిచి నీచిత్తమున సదా మోక్షచింతన గలవాఁ డవై యాత్మతత్త్వవిచారమును బొందుము. ఈ శరీర ధర్మములనువిడువుమని పలికిన, నానిదాఘుఁడు సంత సంబున నతనికి నమస్కరించి, ఓమహాత్మా! దేవరవారు సెలవిచ్చిన పరమార్థతత్త్వమంతయు నా హృదయంబు నం జక్కఁగా నాటినది, నా మనఃకల్మష మంతయును బాసిపోయెను, మీయమృతవాక్యంబులకు నానందుం డనైతిని, దేవరవారెందు చోటనుండువారు? దేవరవారి నామమెద్ది? ఇచ్చటికివచ్చిన కారణమేమి? నాకుసర్వము నెఱిఁగింపుఁడని ప్రార్థించిన నాఋభుండిట్లనియె.



ఓయినిదాఘా! నేనుఋభుండను, నీకుగురుండను, నీకు నద్వైతమార్గమును బోధించుటకై వచ్చినాఁడను. నీవు నన్ను గుర్తింపఁజాలక యతిథిగా భావించితివని పలికిన, నానిదాఘుఁడు, స్వామీ! నేనపచారుండనైతినని దిగ్గునలేచి యతనికి సాష్టాంగపడి నమస్కరించి యంజలి బద్ధుండై నిలిచి, మహాత్మా! నేనుసంసార సాగరంబునం దగిలి యజ్ఞానుండనై సద్గురులరగు మిమ్ముఁ దెలియనే రక పాపము మూటఁ గట్టుకొంటిని, నా యపరాధమును క్షమింప వలయును. నేఁడు నాయదృష్టవశంబున దేవర వారి దర్శన మాయెను. కృతార్థుండనైతిని. నాకు నద్వైత రహస్యమును బోధించి నన్ను జననమరణ ప్రవా హమునుండి తొలఁగింపుమని పెక్కువిధముల వినుతిం చిన, నాఋభుఁడు సంతోషచిత్తుఁడై యతని నాదరించి, భక్తా! అత్యంతరహస్యంబును గుహ్యంబును నగు సోహమను మహావాక్యమునుఁ బొందుటకు నేఁడులోక ముల వారికి మిగుల దుస్తరంబు ఇంద్రాది దేవతలకైన జానఁదెలియుటకు నలవికాదు. ఈ సోహం భావమును చిత్తమునందు ధరియించిన వారే త్రిలోకపూజ్యులు. ఈసోహం భావనాసక్తచిత్తులే మహానులు. ఇట్టిమహాను లకు మోక్షము కరతలామలకంబై యుండును. ఈ సోహం భావమే యద్వైతము. ఇదియే యుపనిషద్వా క్యము. ఇంతకంటెను వేఱొండు మహావాక్య మేలోక మందును లేదు. ఇదియే యేడుకోట్ల మహామంత్రము

లకు మూలమంత్రము. ఇదియే యిష్టసిద్ధిని గలిగిం
చునది ఇదియే. సర్వప్రాణులకునాధారము. నీవును నిట్టి
మహావాక్యమును ధరియించుమని యాతనికి సోహ
మను మహావాక్యమునుబోధించి కృతార్థునిగాఁ జేసి,
శిష్యా! నీవు సర్వకాల సర్వావస్థల యందును నిదుర
లేచి మొదలు నిద్రించునంతవఱకును శ్వాసములను బంధించి
మూలకందమును మనంబున నియమించి యిడాపింగళనాడు
లయందు సంచరించు హంసను నీచిత్తమునందుఁగూర్చి
సోహంభావనాసక్తచిత్తుండవై యుండుము. తక్కిన
గృహకృత్యములన్నియును యథోచితంబుగ జరిపించు
చుండుము. నీకుమోక్షము తప్పక సంభవించును. నేను
పోయివచ్చెద నని చెప్పి దీవించి యామహాత్ముం డరిగెను.
అంత నానిదాఘుండు సద్గురు మహిమవంతుండును దన
భార్యకుంజెప్పి సంసారభ్రాంతు లన్నియు వ్యర్థములని
భావించి తానెందును మోహభ్రాంతులు లేనివాఁడై
సదా సోహంభావనాసక్తచిత్తుండై గృహకృత్యముల
నుదీర్చుకొనుచుఁ, జేతన కోట్లకన్నింటికి నాత్మయొ
క్కండనియు, నదియే తాననియు మనంబున నహంకార
మమకారంబులను విడిచి సర్వము బ్రహ్మ మయంబని
భావించుచు, నతిథి యభ్యాగతులను బూజించుచు,
వారు కోరినటుల క్షుత్పిపాసలు దీర్చుచు. నాత్మభిన్నుం
డుగాక, దేవ, మనుష్య, మృగ, క్రిమి, కీటకాదులు
మొదలగు వానికన్నింటికి దేహభేదంబులే గాని,



యాత్మభేదంబులు గావని తలంచి, యాత్మానంద
సుఖంబునఁ గాలము గడుపుచుండెను. ఇట్లుండఁగా
మఱియును నూఱుసంవత్సరంబులు గడచిన, నొకనాఁ డా
నిదాఘుం డడవికిం బోయి ఫల పుష్ప సమిధలను
మూటగట్టుకొని, దానిని వచ్చుచుండఁగా నా దేశపురాజు
నాటిదినము మత్తగజము నెక్కి యనేకబలములు గొ
లువఁ బురిలోనికివచ్చు నవసర కాలంబగుటచేతఁ, దానా
జనసమ్మర్దమునఁ దప్పించుకొని పోవుటకు శక్తిలేక యు
దనమూట భారముగా నుండుట చేతను, బహుదూర
మడవిలోఁ జుట్టి నడచివచ్చుట చేతను, శ్రమయును, బడ
లిక యునుఁ గలిగి యాపురి రాజవీథిలో నొక యరుగు
మీఁదనెత్తిమూటను, దించుకొని కూర్చుండి, యారా
జును నాసైనికులను, జూచుచుండెను. అట్టితరుణము
న నాఋభుమహాఋషియునువచ్చి యచ్చటఁ గూర్చుం
డిన నిదాఘునింగాంచి నమస్కరించి, యయ్యా! నీ వేల
యిచ్చటఁ గూర్చున్నావని యడిగిన, నానిదాఘుఁడు తనదు
ప్రారబ్ధకర్మవశంబున నాటిదినము సహితము తనగురుం
డని తెలుసుకోలేక, యన్యుఁడుగా భావించి, యయ్యా!
రాజును రాజభటులును బిరుదులు పెండారములతోడ
వీథినిండి వచ్చుటచేత నేని జన సమ్మర్దమును దప్పిం
చుకొని పోఁజాలక యిచ్చటఁ గూర్చున్నాఁడనని చెప్పెను.
ఆమహాత్ముండును నతని చెంతఁ గూర్చుండి, యయ్యా!
రాజెవ్వఁడు, భటులెవ్వరని యడిగెను ఆ నిదాఘుం

నేనుఁగుమీఁదఁ గూర్చుండి పోవువాఁడు రాజనియును, జట్టును గుంపుగాఁ బోవువారు భటులనియును జెప్పెను. అందులకా బుధుఁడు హసించి, యయ్యా! యేనుఁగెక్కడ? రాజెక్కడ? నీ వెఱిఁగినంతవఱకు నాకెఱిఁగింపుమనిన నా నిదాఘుఁడు, ఓయి పిచ్చివాఁడా! యింతమాత్రము నీవు తెలుసుకొనలేవా? నీకు వృద్ధాప్యము తలకెక్కి యిట్లు ఉన్మాదముగా మాట్లాడెదవు గాఁబోలు. ఇది యేనుఁగని యును, నేనుఁగుమీఁదఁ గూర్చున్నవాఁడు రాజనియు ను బసిబిడ్డలైన నెఱుఁగనేర్తురు. అట్లుండఁగా నీవు తెలుసుకో నేరకపోతివా? క్రిందనున్నది యేనుఁగనియు, నేనుఁగుమీఁదఁ బోవువాఁడు రాజనియును దెలుసుకొనుమనిపలికిన, నాతపోధనుఁడు, అప్పా! క్రిందుమీఁదు లేనిదా నాకుం దెలియఁబడలేదు. నీకుఁదెలిసిన నా కెఱిఁగింపుమనిన, నానిదాఘుఁడు మిగులకోపముతో, వెఱ్ఱివాఁడా! ఇప్పుడైన నీవు తెలుసుకొనుమని లేచి యా మహాత్ముని మెడను వంచి యతని భుజములమీఁదఁ గూర్చుండి నీవు మత్తేభము భంగి క్రిందనున్నావు. నేను రాజువలె నీమీఁదం గూర్చున్నాఁడనని పలికెను. అందుకా బుధుఁడు, అయ్యా! నీవు నేనని పలికితివి. వీనియర్థంబులఁ దెలియఁ జెప్పుమనిన, నానిదాఘుఁడు పరమార్థనిష్ఠ తత్త్వంబగు సోహమను మహావాక్యమునందు నీవు నేనను వ్యవహారము లేదని తనమనంబున నెఱింగి యితఁడు మద్గురుండగు ఋభుండుగా నుండుననిభావించి, యతి



త్వరితంబుగ భూమికిలంఘించి, యా మహాత్ముని పాదములమీఁదం బడి, ఓయీ దేశికోత్తమా! సద్గురువర్యా! నే నజ్ఞానవశంబున మిమ్ము సద్గురుండని తెలియ నేరక పాతకకృత్యం బాచరించితిని. దేవరవారి యమృతవాక్యంబులవలన నీవు నాదుగురుండవగు ఋభుమహామునివని తెలుసుకొంటిని. అట్టిమహాత్మునకుం దప్పఁ దక్కిన వారికి నద్వైతసిద్ధి యిట్టుల ప్రకాశింపనేరదని నా మనంబున నెఱింగితిని. దేవర వారు నన్నాదరించి నాతప్పును క్షమించి నా భయమునుం దీర్చి కృపారస దృష్టితో నన్నుంజూచి రక్షింపవలయునని పెక్కువిధముల వినుతించుచు, నతని పాదములను గట్టిగఁ బట్టుకొని విడువకుండిన నా మహాత్ముఁడతని దీవించి లేవఁదీసి, వత్సా! నేను ఋభుండనగుట సత్యము. నీవు నాకు ముందుగానిచ్చిన సేవకాధర్మమునకు సంతసించి నీకు బ్రహ్మవిద్య తేటఁబడ బోధించియుంటినిగదా? అట్టియద్వైత జ్ఞానము నీయందుఁ బ్రకాశించుచున్నదో లేదోయని తెలుసుకొనుటకై వచ్చినాను. నీవు నన్ను ముందువలెనే గుఱుతు పట్టనేరక మనుష్యునిఁగా భావించితివి. "బుద్ధిః కర్మానుసారిణీ" యను శ్రుతివాక్యమెందును వ్యర్థముగా నేరదు. నీవు శిష్యుండవగుటం జేసి నీవు చేసిన కృత్యంబులు నాకు సంతోషకరంబులుగాని సంతాపకరంబులు గావని పలికిన, నా నిదాఘుఁడు వినయ భయభక్తులతో నతనికి నమస్కరించి తన గృహంబునకు వెంటఁ బెట్టు

దప్పించి చీకాకు పడునటుల సూర్యనాడిఁ జంద్రుని, చంద్రనాడిని సూర్యుని నడిపించుచు, వారి సంచారత్రో వలకు సంధిగానుండిన యుజగకుండలిని ఛేదించి, యధో కుండలినిఁ బొంచుకొని తలక్రిందుగా నున్న సర్పమునకుఁ గాకఁ బుట్టించి, యూర్ధ్వ ముఖముగాఁ జేసి, దశవిధ నాదంబులను వినుచు, బ్రహ్మానంద మయుండై ఘంటనాద స్వరములనుబట్టి యాడుచుఁ, గాలుక పిట్టలనుఁ గదియం బట్టుచు, వివిధ చిత్ర్యకళలను జూచి యానందించుచు, సూక్ష్మంబగుచున్నట్టి నాళములోఁ జొచ్చి వియన్మండల, శివా మండలంబులను గడచి, వివిధ చిత్ర్యకళలను [illegible], యూర్ధ్వ కుండలియగు శాంభవీకటినిం గలసి, విద్యుల్లేఖయను కళాస్వరూపునిం జేరి, దశవిధ నాదంబులను జోకార్చి, శబ్దరహితుండై గంగయమున సరస్వతులనెడు త్రివేణీ సంగమంబునం జేరి, యందు మధ్యభాగమున నివాత దీపంబువలె నుండు బిందు స్వరూపమైన యాపో జ్యోతితోఁ గలియుట జీవేశ్వరైక్యంబు. ఈ యోగమును సాధించుటకు నీశరీరంబులోఁ గల-ఇది మిగుల కాఠిన్యము ఈ యోగమును ధరియించినవారు దశవిధ నాదంబులను మండలత్రయంబులను, వివిధ చిత్ర్యకళలను గాంచియును వినియును నానందమును బొందవచ్చునే గాని, బిందు స్వరూపునితోఁ గలియుట మిగుల దుస్తరంబు. ఈ యోగము హఠ యోగంబుతోఁ జేరినదే గాని. కేవల



రాజయోగముతోఁ జేరినది గాదు. ఇది మానవులకు మిగుల నసాధ్యంబై యుండును.

రెండవదియైన కారణాత్మ మార్గమగు సాంఖ్య దర్శన యోగము మిగుల సునాయాసంబు. ఇది మానవులు సాధించుటకు మిగుల సుఖతరంబుగా నుండును. కావున నిది రాజయోగంబని చెప్పంబడు చున్నది. ఈ రాజయోగ మతిశీఘ్రముగాఁ ఫలితార్థము నిచ్చునట్టిది గనుకనే గృహస్థాశ్రమమందుండు రాజులు మొదలగు మానవులును, గొందఱు మహాత్ములును, దీని నభ్యసించి మోక్షమును బొందిరి. కావున నీవును నిట్టిమార్గము ననుసరించి బిందు స్వరూపమైన మహా కారణ స్వరూపమగు నాత్మజ్యోతినిం బొందుమని. యా సావిత్రినిఁ దవసమీపమునం గూర్చుండఁ బెట్టుకొని, మానవపుత్రా! నీవు మిగుల భాగ్యశాలివాఁడవై తొలుతఁ గారణ స్వరూపుఁడగు మాయామయునిం జూడుమని దర్పణ మతనిచేతికిచ్చి, గవాక్షముల నెడు కంటి తెప్పలను జక్కఁగాఁ దెఱచి నీముఖమును, శ్రోత్రములను, నాసికను, జిహ్వను జూడుము. ఆజిహ్వకు నాధారమే చిత్తము. ఆచిత్తమే సర్వ కోరికలకు మూలమగు జీవుఁడు. ఆ జీవుఁడే నీవుగాని తక్కిన యింద్రియములు, శరీరము నీవుగావు. నీకే బంధ మోక్షములు గలుగుచుండును. అట్టి చిత్త స్వరూపుండ వగు నీవు జ్ఞాత స్వరూపంబగు తేజంబుతోఁ గలసి ప్రపంచ రూపంబు

అగు చిత్రవిచిత్రములను జూచుటచేత, నీకు బంధము సంభవించును. ఇదే ప్రపంచజ్ఞానమని చెప్పంబడును. అట్టి చిత్స్వరూపమగు నీవు జ్ఞాతస్వరూపానంబగు తేజంబుతోఁ గలసి, నామరూపాత్మకమగు ప్రపంచ చిత్రము లేమియును జూడక, సర్వచిత్కళను మీఱి, బిందుస్వరూపమగు నాపోజ్యోతితోఁ గలియుటచేత, నీకు మోక్షము తప్పక సంభవించును; ఇది బ్రహ్మజ్ఞానమని చెప్పంబడును. ఈ రెంటినే పెద్దలు బంధమోక్షంబులని చెప్పిరి. ప్రతిబింబ చైతన్యమే జ్ఞాతయగు కారణస్వరూపుఁడు. నిజబింబమగు శుద్ధచైతన్యమే మహాకారణ స్వరూపుఁడు. అట్టి నిజబింబమగు శుద్ధచైతన్యము శ్వేతము గాను, ప్రతిబింబ చైతన్యమగు మాయ సునీలము గాను నున్నది. అట్టి సునీలమగు కారణపురుషుఁడే పదునాలుగు లోకంబులకు మూలంబు. అతఁడే శ్రీమన్నారాయణమూర్తి. అతని చుట్టును నుండు శ్వేతమే క్షీర సముద్రము. అందు నలుపే వటపత్రము. అట్టి మఱ్ఱియాకుమీఁద శయనించిన యణుమాత్రపుఁ బ్రమాణ పురుషుఁడే నారాయణమూర్తి. అదియే విష్ణుకాశి, అదియే రామేశ్వరము. అదియే గంగ - యమున - సరస్వతులుకూడిన త్రివేణీసంగమంబు. అదియే - అకార ఉకార - మకారంబు లగు త్రిమూర్త్యాత్మక స్వరూపంబు. అదియే నాదబిందుకళలు. అందు రక్తవర్ణమే పృథివి, శ్వేతవర్ణమే జలము, నలుపు వర్ణమే అగ్ని,



ధూమ్రవర్ణమే వాయువు, సునీలమే ఆకాశము. అందు పీతవర్ణమే యాధారము. అందు శ్వేతవర్ణమే స్వాధిష్ఠానము. అందు రక్తవర్ణమే మణిపూరకము. అందు ధూమ్రవర్ణమే యనాహతము. అందు నీలవర్ణమే విశుద్ధము. అందు సునీలమే యాజ్ఞేయము. అట్టి యాజ్ఞేయమందుమెఱుపుఁదీగవలెఁ బ్రజ్వరిల్లెడు కిరణముచే సహస్రారము. కారణస్వరూపుండగు మాయామయునియొక్క మాయను దెలుసుకొనుటకును, నట్టి మాయను దాటుటకును నేడు లోకంబుల వారికి నసాధ్యంబు. చైతన్యస్వరూపులగు సర్వప్రాణులను, తన మాయారూపంబు లగు చిత్ర విచిత్రముల యందు, మోహ భ్రాంతులను బుట్టించి, తన మాయా సముద్రమునందు ముంచుచున్నాఁడు, అతఁడే యింద్రజాల మహేంద్ర జాలకుఁడు. అతని దర్శనమే సర్వ పాపక్షయము. అదియే మహాస్మరవు. అదియే నీలతోయదము. "నీలతోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా । నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా" అని పలుకు శ్రుతివాక్యప్రకారము - అట్టి నీలతోయదంబను నల్లదామరకు మధ్యభాగంబున, సుషుమ్నానాళమను మిగుల సన్నపుబిలము గలదు, అబిలమందు మహాకారణ పురుషుండగు పరబ్రహ్మముండును. ఆ బ్రహ్మమునుండి వెలువడి వచ్చెడు కళలె విద్యుల్లేఖ యని చెప్పంబడు మెఱుపుఁదీఁగెలు. అట్టి మెఱుపుఁదీఁగె లనేకకోట్ల సూర్యచంద్రులు వెలిఁగి

పటులఁ బ్రకాశించుచుండును. అట్టి పరబ్రహ్మమగు నాత్మస్వరూపుఁడు తనకళలన్నియును సూర్య చంద్రాగ్నులకునిచ్చి, తానునిష్కళస్వరూపుండై సర్వసాక్షియై యుండును. సూర్య చంద్రాగ్నులుండు స్థానములే మండల త్రయము. వీనివలనఁ గలిగినవే చిత్కళలు. అట్టి నిష్కళస్వరూపుఁడే బిందురూపకమగు జ్యోతి. అట్టి జ్యోతిస్వరూపుఁడు త్రివేణీ సంగమంబగు నుదకమునందుఁ దోఁచుటచేత 'ఆపోజ్యోతి' యని చెప్పంబడుచున్నాఁడు. నీవు సద్గురు వాక్యమును నమ్మి భక్తిశ్రద్ధలు గలవాఁడవై సద్గురునిశ్చయ మేమియును లేని దృఢచిత్తము గలవాఁడవై సునీలముకోఁధం గూడి లక్ష్యార్థమును బొందుపఱచుకొని, యందు సన్నబింబంబులో మారిపోయి బిందుస్వరూపంబగు నాపోజ్యోతిని జూచి దానిం గలియుమని బోధించిన, నాసాధకుఁడు నిండు వైరాగ్యంబున లక్ష్యార్థమును జక్కఁబఱచుకొని, యాపోజ్యోతులం జూచి వానియం దైక్య భావమును బొంది, కొంతసేపు నిశ్చేష్టితుండై నిలిచి, యేమియును దోఁచక సద్గురు చరణారవిందములకు సాష్టాంగపడి నమస్కరించి, స్వామీ! సర్వవృత్తి రహితుండనునై చలన మించుకయును లేక, (నివాత దీపంబుల పగిది నుండు బిందుస్వరూపంబగు నాపోజ్యోతులను రెంటిని బొడఁగంటిని, దేవరవారొక్కటని సెలవిచ్చితిరి. నాకు రెండుగాఁ గనుపించినవని చెప్పిన,) నా జడభరతుండు,



బిడ్డా! (త్రివేణీ సంగమంబగు మహా జలరాశికి మధ్యభాగంబున, నాసికయని చెప్పంబడు సేతువు, కట్టగా నుండుటవలన, నాజలరాశి రెండుమడుగులాయెను. ఆ రెండు మడుగుల యందును, రెండుగాఁ గనుపించినదేగాని, యదియొకటే జ్యోతి. అదియెట్లనగా:—ఒక్కండగు చంద్రుఁడు పెక్కు నీళ్లకుండలలో ననేక చంద్రులుగాఁ దోఁచినట్లు, కారణ స్వరూపుఁడుండు నీలకోయగంబులు రెండును, రెండుకుండలు. ఆ రెండు నీళ్లకుండలయందును రెండుగాఁ దోఁచినదేగాని, యాత్మస్వరూపం బొక్కఁడే. అతఁడే పరబ్రహ్మము అతఁడే శ్వేతలింగము. అదియే శివరాశి. అట్టి మహాకారణస్వరూపుండగు హిరణ్యగర్భుఁడే సర్వసాక్షి. అతఁడే వేదస్వరూపుఁడు అతఁడు సర్వము గుర్తెఱుఁగుటచేత నెఱుకయని చెప్పంబడుచున్నాఁడు. అతఁడే శుద్ధచైతన్య స్వరూపుఁడు. యోగపురుషుఁడు వైరాగ్య మోహాంబులతో, లక్ష్యార్థము చేత నాబ్రహ్మమునం దైక్యమగుటను బట్టి, దానిని ముక్తికాంత యని చెప్పంబడుచున్నది. అదియే యాదిశక్తి. అదియే ప్రజ్ఞానం బ్రహ్మ. అదియే తత్త్వమసి. అదియే జ్ఞేయము. అదియే త్రిపుటి. అదియే సచ్చిదానందము. సర్వవిషయ తీవ్రుండవగు నీవు నీ స్వస్వరూపమును బొందుటచేత నీవదియైతివి. అదియే నీవు. బ్రహ్మమునం దైక్య సమాధిని బొందితివి జీవభ్రాంతి నిన్నుం బాసిపోయెను. జీవన్ముక్తుండవై తివి

బింబస్వరూపమందు, మనోమాయాకృతంబు లన్నియును లయించుటచేత సమరసమ్మండ వైతివి. నీవు తప్ప నితర మేమియును లేనందున, నీవే యద్వితీయుండవు. నీవే యీశ్వరుండవు. నీకు బంధము లేదు సదా మోక్షమందే యున్నావు. నీస్వస్వరూపమే మోక్షము, నీకు వేఱు మోక్షము లేదు. బంధమే జీవుండు, నీవు సర్వబంధ విముక్తుండ వైతివి. నీ స్వస్వరూపమే గురుస్వరూపము, అంశము గురుండు - పిండము గురుండు - బ్రహ్మాండము గురుండు. ఈ చరాచర మంతయును సద్గురు స్వరూప ముగా దెలియుము. సద్గురునికంటె నితర మేమియును లేదు. నీవు సద్గురుస్వరూపమందు గలియుటచేత, నీవే గురుస్వరూపుండ వైతివి. మన మిగత మేకీభవించిన స్థానమే పరమార్థము. ఈపరమార్థమునందు ప్రపంచ ముగాని, చిత్రవిచిత్రములగు నామరూపంబులు గాని లేవు. శివుండని, విష్ణువని, బ్రహ్మయని చెప్పంబడు నామంబులుగాని, జీవేశ్వరుల నెడు వ్యవహారముగాని, నేను నీవను వార్తలు గాని లేవు. "ఏ దేవపంచభూతాని ఇదే వ భువనత్రయం । విజ్ఞానమేవ మధురం రమ్యం గ్రాహ్యంఛి దేవహి" అనిచెప్పంబడుచున్నది గాన జ్ఞానమే బ్రహ్మస్వరూపము. జ్ఞానమే పరమాత్మ. అజ్ఞానమే జీవ శరీరములు. చిత్స్వరూపుండగు పరబ్రహ్మము వలన పంచభూతములును స్వర్గమర్త్య పాతాళలోకంబులు మూడునుగలిగి, యవి యన్నియును విజ్ఞానమందు



లయించి, చిత్స్వరూపుని యొక్క స్వస్వరూపము మాత్రమే బింబ స్వరూపముగా నిలిచినది. ఇది తప్ప నేమి యును లేదు. ఈ నిజ బింబమే పరమాత్మ. ప్రతి బింబమే ప్రత్యగాత్మ. ఈ ప్రత్యగాత్మ పరమాత్మలే జీవేశ్వరులు. జీవేశ్వరులే శరీరాత్మలు. ఈశరీరాత్మలే ప్రకృతిద్వయము, ఈ రెండును నుపాధిద్వయము. ఈ రెండును ప్రకృతిపురు షులు. ఈప్రకృతి పురుషైక్య స్థానమే సహస్రారము. అందు బింబ స్వరూపమే యమృతము. అదియే ఫాలనేత్రము, అదియే మూడవకన్ను. అదియే ధీయోయోని. అదియే నీస్వరూపము. సర్వబంధ విముక్తుండ వైతివి. నీకు భ్రాంతి లేదు. కామాది శత్రువులు నిన్నుం బాసిపోయిరి. శత్రు క్షయుండ వైతివి. నిన్ను నీవు దెలుసుకొంటివి గదా! నీ వేకాలమందైనను జీవుండనని యనుకొనవలదు, నీ వెసంశయమును బొందవలదు, సర్వము నీవుగానే భావించి యాత్మానంద సుఖంబున నుండుమని చెప్పిన, నా నావిని యద్భుతమునొంది యా మహాత్ముని పాద కమ లంబులను తన జ్ఞానేంద్రియంబులు స్పృశించునటుల సాష్టాంగపడి నమస్కరించి, సద్గురునాథా! నాభాగ్యమే భాగ్యము దేవరవారి కటాక్షంబున, నాస్వస్వరూపమును బొందితిని. నా జన్మస్థానం బెఱింగితిని, ధన్యుండ నైతిని, జీవన్ముక్తుండ నైతిని, నాకెందును భ్రాంతి లేదు, చిత్తా దింద్రియములు లేవు. ఏ కర్మములును లేవు. బ్రహ్మేం ద్రాదులకు నలవిగాని, రూపభావమును గ్రహించి మో

ధ్యానందుండ నైతిని. మహాత్మా! దేవరవారి ప్రభావమును దెలియనేరక, సామాన్యునిగా భావించితిని, నా యజ్ఞానమును క్షమించి నన్ను రక్షించి నన్ను మోక్షప్రాప్తునిగాఁ జేసితిరి. దేవరవారి పాదముతప్ప మఱేమియును లేదు. నామనంబునకు ధైర్యస్థైర్యంబులు గలుగునటుల, నీ గూఢభావమును బొందిన, పుణ్య పురుషులలో నొకరి చరిత్రమును బోధించి నన్నుఁ గృతార్థునిఁగాఁ జేయుఁడని ప్రార్థించిన, నా జడభరతుఁడు సౌవీరునిం జూచి, మానవపుత్రా! సర్వ పాపక్షయంబును, మిగులఁ బావనంబును సత్యద్భుతంబును నగు సంవర్తుఁడను మహాఋషి చరిత్రము నిఖిల బృందారక వందితంబునై యుండు నీకా చరిత్ర మంతయును, సావధాన చిత్తుండవై వినుమని యిట్లనియె.

సంవర్తుఁడను మహాఋషి చరిత్రము

మానవపుత్రా! తొల్లి యంగీరసుండను మహాఋషికి బృహస్పతి యనియును, సంవర్తుఁడనియును, నిరువురు పుత్రులు జన్మించిరి. ఆ యంగీరసుఁడు పెద్దకుమారుఁడైన బృహస్పతికి సమస్తవిద్యలును, సదాచార క్రమంబులును, శాస్త్రంబులును, నుపనిషద్వాఖ్యానంబులును, వేదంబులు, వేదాంతార్థంబులును, మహామంత్రంబులును, వివిధ ధర్మంబులును, వశీకరాది మంత్రసిద్ధులను బోధించి, మిగుల బుద్ధిమంతునిఁగాఁ జేసి, తారయను కన్యకామణిని దెచ్చి యతనికి వివాహము గావించెను. రెండవ పుత్రుం



కన్యకామణిని దెచ్చి యతనికి వివాహము గావించెను రెండవ పుత్రుం డగు సంవర్తునకును విద్యాభ్యాసము చేయించి యెల్లవిద్యలు గఱపుచుండెను. ఇట్లుండఁగాఁ గొన్ని దినంబులకు దివిజపతి యగు దేవేంద్రుఁడు యమ కుబేరాది దిక్పాలురతోడ సభచేరి, ఓ మహామిత్రులారా! మనము శ్రేయస్కరంబునకుం గాను, సత్కార్యంబులును, బరమార్థంబునకుం గాను భక్తియోగ జ్ఞానంబులును జేయవలసి యుండును గదా? అందుకై మనకొక గురుఁడు లేకుండిన, మన కార్యంబులన్నియు నెట్లు సఫలంబులగును? గురువు లేని విద్యలన్నియును వ్యర్థంబులగును. కావున మనకుం దగునైన సద్గురువును నియమించుకొందము. అంగీరసుని పుత్రుం డగు బృహస్పతి మిగుల విచారణ పరుండని నాకుం దెలియవచ్చుచున్నది. మన మతని మన దేవలోకంబునకుం గొనివత్తుమని యాలోచించి, యా నిలింపులు గుంపులుగూడి యా యంగీరసుని యాశ్రమంబునకువచ్చి, యా మహాత్ముని బ్రార్థించి, యాబృహస్పతినిఁ దమకు గురునిఁగాఁ జైకొని, తమ లోకంబునకుం బోయిరి. ఆ యంగీరసుండును దన పుత్రునకుం గలిగిన శ్రేయస్సునకు మిగుల సంతసించి, రెండవ పుత్రుండగు సంవర్తునకు ధర్మార్థకామ మోక్షంబులను, సదాచార క్రమంబులను, శాస్త్రంబులను, నుపనిషద్వాఖ్యానంబులను, వేదంబులను, వేదాంతార్థంబులను, మహామంత్ర ప్రయోగంబులను, వశీకరాద్యష్ట సిద్ధులను

బోధించి, యోగవిద్యా విలసితునిఁగాఁ జేసి, సమాధి లక్షణంబులన్నిఁటిని దెలియఁబఱచి, పిండ - పద - రూపాభావంబులను జక్కఁగా బోధించి, సమాధి నిష్ఠునిఁగాఁ జేసెను. ఆసంవర్తుఁడు శ్రేయస్సునుం గోరక, శరీరాభిమానంబును విడిచి, దీర్ఘసమాధులను గావించుటను జూచి, యా యంగీరసుం డతనిం గృహస్థునిఁగాఁ జేయఁ దలంచి, మమతయను కన్యకామణినిం దెచ్చి యతనికి వివాహముగావించి, తనయాశ్రమంబునకు సమీపంబున నొకయాశ్రమంబు నిర్మించి యాదంపతుల నందుంచి తా నెటువంటి సంకల్పములును లేక, నిర్వికల్ప సమాధులను గావించుచుండెను. ఆసంవర్తుఁడును దనతండ్రి యాజ్ఞప్రకార మాయాశ్రమమందు సదా నిర్వికల్ప సమాధులనుగావించుచు నెప్పటప్పటికిఁ దనయన్నయొద్దకుం బోయి, పరమార్థముతప్పఁ దక్కిన వేమియును లేదని దేవతలకుం జెప్పుచు, నిటులఁ దన భార్యతో వర్తించుచుండెను. ఇట్లుండఁగాఁ గొన్ని దినంబులకు నామమత గర్భమును ధరియించి, నవమాసములు నిండియుండఁగా, నొకనాఁడు దేవగురుండగు బృహస్పతి తనతమ్ముని యాశ్రమంబునకువచ్చి, యందుఁ బూర్ణసమాధిలో నున్న తనతమ్మునిం గానక, యందుఁ దిరుగుచున్న తనతమ్ముని భార్యయైన మమతను జూచి యాహాయనూడన మోహభ్రాంతులు గలవాఁడై, పూర్ణగర్భిణియని యోచింపక భోగముఁగోరిన, నామె గర్భమందుండు భిక్షు యతని



నాపేక్షించి యిది యధర్మమని పలికిన, నా దేవగురుఁ డా బిడ్డను గ్రుడ్డివాఁడవుగాఁ బుట్టుమని శపించి, తనలోకంబునకుం బోయెను. అంత నామమత జరిగిన వృత్తాంతమంతయుఁ దనభర్తకెఱింగించిన, నాసంవర్తుఁడు మిగుల విచారమునుబొంది, తనయన్న దుర్గుణంబునకు … రోయుచుండెను. ఇట్లుండఁగాఁ గొన్ని దినంబుల కంతయు, నామమత మగబిడ్డనుం గనెను, ఆ సంవర్తుఁ డా యంధకుఁడైన బిడ్డనుం జూచి, విచారమునొంది దీర్ఘతముండని నామమునిచ్చి, పిమ్మటఁ దాను మిగుల వైరాగ్యమును బొంది దిగంబరుఁడై తండ్రి యాశ్రమంబునకుం బోయి యా మహాత్మునకు నమస్కరించి తనయన్న చేసిన కార్యమును జెప్పి యట్టి యంధకుఁడైన బిడ్డనుం జూడఁజాలక, ప్రపంచ వృత్తులన్నిఁటిని విడిచి బ్రహ్మమయుండనై యున్నానని చెప్పి యతని యాజ్ఞనుం బొంది, కాశీక్షేత్రంబునకువచ్చి యందు నభేదవృత్తినిం బొంది, యెవ్వరేని పెట్టినం గుడుచుచు, విధినిషేధములులేక, కేవల బ్రహ్మమయుండై, గంగానదీ తీరంబునం దిరుగుచుండెను. ఆకథ యిట్లుండఁగా,

భూమండల మంతయు నేకఛత్రంబునం బాలించుచుండిన మరుత్తుఁడను మహారాజు శ్రేయస్సునుం గోరి, యనేక రాజసూయాశ్వమేధాది యాగంబులఁ గావించి దేవతలను, భూదేవతలను సంతుష్టినొందించి ధర్మదేవతను నాలుగు పాదములతో వర్తింపం జేయుచు, సర్వ

నదీతీరంబునం దిరుగుచున్న ధూమమహాత్మునిం గాంచి మెల్లమెల్లఁగా నతని వెనుకప్రక్క నేపోయి, యతని పాదములమీఁదఁ వ్రాలి, స్వామీ! దీనునిరక్షించుము,రక్షించుము నేను బృహస్పతివలనమోసపోతినని,యతనివృత్తాంతమంతయు నెఱింగించి, దేవరవారువచ్చి నాయాగమును పూర్తిసేయించి నన్నుఁ బావనునిఁగాఁ జేయుఁడని పెక్కు విధములఁ బ్రార్థించిన, నాసంవర్తుఁడు, మానవేంద్రా! నా వృత్తాంతము నీకెవ్వరు చెప్పిరి? నారదమహామునికిఁ దప్ప నితరులకు నావిషయంబు దెలియదు. నీ కతఁడే చెప్పెను గాఁబోలును. మంచిది నేనువచ్చి నీయాగమును పూర్తిసేయింతును. వెఱువకుమని యతని భయమును దీర్చి యతని యిష్టప్రకారము పల్లకిలోఁ గూర్చుండెను. ఆ మరుత్తమహారాజు సంతోషంబున నామహాత్ముని యజ్ఞవాటికకుఁ గొనివచ్చి క్రతువుఁ జేయుటకు నారంభించెను. ఈవర్తమానమును దేవేంద్రుఁడు మొదలగు దిక్పతులు గ్రహించి, బృహస్పతినిం జూచి, సద్గురువర్యా! మరుత్తమహారాజు, దురాచారుండును, జాతిస్మరణ లేనివాఁడును, గేవల జడుండునునగు, నీతమ్మునివలన యాగంబుఁ గావించుచున్నాఁడు. అందు హవిర్భాగంబులు గొనుటకు మనమెవ్వరును బోఁగూడదని తీర్మానించుకొనిరి, ఇక్కడ నాసంవర్తుఁడు ముప్పదితొమ్మిది దినంబులు నిర్విఘ్నముగా నాయాగమును బూర్తిచేయించి నలువదియవ దినంబున, నష్టదిక్పాలురకు హవిర్భాగంబు లుంచి,



సమంత్రపూర్వకంబుగ నా యగ్నిగుండమున యాజ్యప్రయోగంబుఁ గావించియును, నా యష్టదిక్పతులు రాకుండుటను దన దివ్యజ్ఞానంబున నెఱింగి, మరుత్తుఁడా! దేవతలువచ్చి వారి హవిర్భాగంబులు గొనుటకు నిష్టము లేక నాయందు ద్వేషమును వహించిరి, నేను వారిని ముద్దకట్టుగాఁ గట్టి తెప్పించెదనని చెప్పి దివ్యమంత్రప్రయోగంబులు గావించెను ఆ మహాత్ముని మహిమవలన, నా మంత్రము లింద్రాద్యష్ట దిక్పతులను పాశములతోఁ బంధించి నిశ్చేష్టితులుగాఁ జేసి, గొనివచ్చి వారివారి హవిర్భాగంబులయొద్దం గూర్చుండఁ బెట్టెను. అందుకు నింద్రాది దిక్పతులు భయమును, దుఃఖమును, సిగ్గును బొంది, తలలువంచుకొని యూరకుండిరి. ఆ సంవర్తుఁడు వారినిం జూచి, దురహంకారు లారా! మీరు నన్ను దురాచారుండని పలికితిరి గదా! నాభార్యను వంచించి దాని గర్భమందుండు బిడ్డను నంధకునిగా శపించిన మీ గురుఁడు దురాచారుఁడో, లేక యజాతభిక్షుండనై భేద భావన లేక బ్రహ్మానందుండనై యున్న నేను దురాచారుండనో మీ వివేకంబునం దెలియుఁడు. మీ గురుఁడు తన భార్యవలన దుఃఖమును, మానహీనమును బొందును గాక, మీరు బుద్ధిమంతులరై సంతోషముతో హవిర్భాగంబులను బుచ్చుకొని ప్రభువును నిష్టసిద్ధిం బొందునటుల దీవించుఁడు, లేకుండిన మిమ్ము సముద్రంబునం బడఁ ద్రోసింతునని పలికిన, నా యింద్రాదిదిక్పతులు వెఱఁగు

నదీ, యూపమహాత్మ్యమిఁ బెక్కువిధములఁ గీర్తించి, ప్రఖ్యాతం బైన హరిక్షేత్రాగంబులు పుచ్చుకొని, యా రాజేంద్రుని దీవించి యా సంవర్తుని యాజ్ఞనుఁ బొంది దివంబున కేగెను. అంత నా సంవర్త మహర్షి యా ప్రభువును దీవించి యథా స్థానంబున కాశీక్షేత్రంబునకుం బోయి, యందు దీర్ఘ సమాధులను గావించి, శివేశ్వరైక్య సమాధిం బొంది శాశ్వతమహానందంబగు మోక్షమునుఁ బొందెను. కాఁబట్టి, యీ రూపభావమును గురుముఖంబున లక్ష్యార్థపరులై యనుభవ నిశ్చయంబుగ గ్రహించినవారు తప్పక మోక్షమునుఁ బొందుదురు. ఇందుకు సందియంబు లేదని పలికిన, నా శౌవీరుఁడు సాష్టాంగ నమస్కారమును గావించి, మహాత్మా! దేవరవారి కటాక్షంబున నేనును రూపభావమును ననుభవ యుక్తముగ గ్రహించి. సర్వసంశయ ములు త్రెంచనైతిని. మోక్షము నాకుఁ గరతలామలకం బై యున్నది. అద్భుతమైన సంవర్త మహాయోగి చరిత్ర ప్రభావములను, మరుత్త మహారాజు వృత్తాంతమును సర్వమును గ్రహించితిని. దేవరవారు, నాకు రూపాతీత భావమును గటాక్షించెదరని వినుతించిన, నా జడభరతుండు చిఱునగవుతో, నా శౌవీరునిం గాంచి యిట్లని బోధింపం దొడంగెను.

జడభరత మహాయోగి శౌవీరమహారాజునకుం
బోధించిన రూపాతీతభావము.

రాజేంద్రా! "రూపాతీతం నిరంజనం" అని యున్నది,



గనుక రూపాతీతమే నిరంజనము. నిరంజనమనఁగా నే దోషమును లేనిది. దోషమనఁగా ప్రకృతిదోషము గాని, పురుషదోషముగాని, యీ రెండును లేని ద్వంద్వ దోషరహితమైన కేవలాత్మ యని చెప్పంబడును. ఈ కేవలాత్మ, రెండుగ పాలుపులు లేనిసర్వశూన్యము గనుక పరిపూర్ణమని చెప్పంబడు చున్నది. ఈ పరిపూర్ణమే కాలమందును స్థూల రూపముగాని, సూక్ష్మ రూపముగాని, కారణరూపముగాని, మహాకారణ రూపముగాని, పొంద లేదు. ఈ పరిపూర్ణము సర్వ లోకంబుల యందును, సర్వ దేశముల యందును, సమస్త వస్తువుల యందును బూర్ణముగా నిండి, ముల్లు గ్రుచ్చుటకైనను సందు లేక, నిండి నిబిడీకృతమై, నామ రూప రహితమై స్వతస్సిద్ధమై, యిట్టిదట్టిదని నిర్దేశింపరాక, చలన మించుక యును లేక యున్నది. కావున నీ పరిపూర్ణమును, నచల మహా సముద్రంబని చెప్పం బడుచున్నది. సర్వకాల సర్వావస్థల యందును నొక్కటె విధముగాఁ జలనాదులు లేక యుండుటనుబట్టి, నిస్తరంగ సముద్రంబని చెప్పఁ బడుచున్నది. ఈ యచల మహాసముద్రమే నిరంజనము గాని, శరీరాత్మలను నిరంజనం బని చెప్పరాదు. కేవలాత్మకంటె నేమియును లేదు. "ఆత్మాతీతం కేవలాత్మ। దేహో నాస్తి కదాచన। అస్తి నాస్తి తిరో వేదా। నిర్ణయో నాస్తి సర్వదా॥" అని పరమశివుని వాక్యము గనుక, నాత్మ పరమాత్మల కతీతమై, యేకాల

నిమిత్తముగాని, శాస్త్రముగాని పుట్టనేలేదు. "ఆకాశవ్య గుణాశ్శబ్దో। నిశ్శబ్దో బ్రహ్మఉచ్యతే" అని చెప్పంబడి యున్నది గనుక, నీ నిరంజనమందు శబ్దమించుకయు నులేదు. శబ్దగుణకమైన యాకాశమును బ్రహ్మమని చెప్ప రాదు. ఏమియును లేని మాయాతీతపరిపూర్ణము వలన సర్వసాక్షిస్వరూపముగ నెటుకపుట్టినదని చెప్పుట వివేకముకాదు. ఏమియును లేని బట్టబయలు ఎటులం బుట్టించును ? పుట్టింపనేరదు. మాయా భ్రాంతిస్వరూపములైన శరీరాత్మలు పుట్టినట్టును, క్షీణించినట్టును దోచుట భ్రాంతియేగాని నిజముగాం బుట్టినవి కావు. స్థిరముగా నిలిచినవియును గావు. సర్వకాల సర్వావస్థలయందును నీ పరిపూర్ణమే యున్నదిగాని, నామరూపములుగల ప్రపంచశరీరములు లేనే లేవు. ఏమిచూచినను, ఏమి చేసినను, నేమి వినినను, నేమి భావించినను సర్వమును మాయ, ఈ బట్టబయలుకంటె నేమియును లేదు. ఇదియే నిజగురుమంత్రము. ఈ గురుపదమునకంటె నేమియును లేదు. మాయా స్వరూపుండగు మహాకారణ స్వరూపునివలన, కారణ - సూక్ష్మ - స్థూలంబులు గల్గుటచేత, నీనాలుగు దేహంబులును భ్రాంతి స్వరూపములేగాని నిజముగా నున్నవిగావు. నేను నేననువాండే అహంకారుండు. తాను తాననువాండే మూలమాయ, నేను-తాను-అనువార్త లీనిరంజనము వలన నేకాలమందును బుట్టనేలేదు. "తస్యమూలంనాస్తి"



అని యున్నది గనుక నాత్మస్వరూపుండగు సర్వసాక్షియైన నీకును మూలము లేదు, మూలము లేని యాత్మ శరీరములకుం గులము లేదు, గోత్రము లేదు, జాతిలేదు. నేమ, నిష్ఠ, ఉపవాస, స్నాన, జప, హోమాది క్రియలు లేవు. మూలము లేని చండాలము గనుక నేమిచేసినను ప్రయోజనము లేదు. పరిపూర్ణమును దర్శించుటే దీనికిం ప్రయోజనము. ఈ శరీరాత్మలు రెండును గలలోని మూర్చట్లు, కలలోవచ్చిన శరీరములు మేల్కొనిన నటుల శూన్యములో, యటుల సద్గురు వాక్యముచేత మేల్కొనిన వారికి శరీరాత్మలు లేవు. మూలము లేని మా గుర్తెఱుంగు శరీరములు మటుమాయములుగాం బోవునవి గాన, నీశరీ రాత్మలు లేవని నిశ్చయమైనదే - బోధకాసురి మంత్రము. గనుక నీ శరీరాత్మలను నమ్మవలదు. ఈశరీరాత్మ లెట్లు దబ్బరో, యటువలెనే దేవ శరీరాత్మలును దబ్బర. నామరూపంబులు మాలిక్కి. ఈ నిరంజనమునకంటె నేమియును లేదు. పిండ - పద - రూప - భావములు మాయ, రూపాతీతమే సత్యము. ఇంతకంటెను వేఱొండు సత్యము లేదు. శరీరాత్మల కంటెను నిషిద్ధమేమియును లేదు. ఈ కేవలాత్మ వలన నాలుగు మహావాక్యములును బుట్టనే లేదు. నాలుగు మహావాక్యములును - శరీరాత్మలనే చెప్పుటచేత, నివి నాలుగును భ్రాంతి స్వరూపములే గాని నిజమును దెల్పునట్టివి గావు. నీ వెందును భ్రాంతిం బెట్టవలదు. దేవ భ్రాంతియును, దేవ

కాలాంతర భ్రాంతియును, లోకభ్రాంతియును, లోకాంతర భ్రాంతియును నీకు వలదు. నీ నిజస్వరూపమే సర్వము నిండి స్వతస్సిద్ధముగా నున్నది. నీ నిజస్వరూపమునకంటె నేమియును లేదు. ఎందును భ్రాంతిఁ బెట్టవలదు. అశరీరుండ వైతివని పరిపూర్ణభావమును సాంగముగా వినుపించిన, నా సౌవీరుఁడు సాష్టాంగ నమస్కారములు గావించి, స్వామీ ! సద్గురువర్యా ! నానిజస్వరూపమును బొందితిని. ఇంతకంటె నేమియును లేదని మనంబున తీర్మానించితిని. సర్వస్వంబు శూన్యంబైనది. ఈ గురుపదంబునకంటె నేమియును లేదు. లోకంబున దొంగబ్రోవలకు లెక్కలేదు. ఈ రూపాతీతభావమే సత్యము. విదేహ కైవల్యమును బొందిన తొల్లింటివారి చరిత్రములలో నొకటిఁ జెప్పి నాకు మనోవృషమును గావింపుఁడని వేఁడిన, నా జడభరతుండు దేవలుండను యతిని చరిత్రము మిగుల సద్భుతము వినుమని యిట్లనియెను.

దేవలుండను యతిని చరిత్రము.

నరేంద్రా! తొల్లి దేవలుండను నొకయతీంద్రుఁడు దావన గర్వంబున నెవ్వరిని లక్ష్యపెట్టక యొకనాఁడు దేవసభకుం బోయి యందు నాట్య - నృత్య - గీత - గానము ...చుండిన రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ ...లను జూచి తిరస్కార భావముతో, నో ...లారా! మిథ్యామాయలకు లోఁబడిన ...లెందుకే గాని నావంటి ధీరుఁడు



మిమ్ము మెచ్చుకొనఁడని పలికెను. ఆ దేవవేశ్యలు కోపించి నీవు లోకంబున మర్కటముగాఁ బుట్టుమని శపించిరి. ఆ దేవేంద్రుఁడు వానిం జూచి, దురాత్మా ! మకవు లేమంగువై పుట్టుమని శపించెను. వెంటనే యమధర్మరాజును, వహ్నిదేవుండును, నైరృతియును, వరుణదేవుండును, వాయుదేవుండును, కుబేరుండును, నీశానుండును వరుసగా శపించిరి. ఆ దేవలుఁడు మిగుల ఖిన్నుఁడై తన నిలయంబునకు వచ్చి నే నిటుల నలుగురిలోఁ దిరుగనేర్తునని దేవునిం గూర్చి ప్రలాపించుచు, నొకనాఁడు చతుర్ముఖుని యొద్దకుం బోయి నమస్కరించి ఓ దేవ దేవోత్తమా ! దీనుండనైన నన్ను రక్షింపుమని తనవర్తమానమును దనకుం గలిగిన శాపములను జెప్పి, నన్ను రక్షింపకుండిన నాకు దిక్కెవ్వరని దుఃఖించిన, నా బ్రహ్మదేవుం డతనిని నాదరించి, దేవలుఁడా! నీకుం గలిగిన శాపములను బోఁగొట్టుటకు నేను సమర్థుఁడనుగాను, నీవు సద్గురుని నాశ్రయించి వారికటాక్షమును బొంది కృతార్థుఁడవుగమ్ము, పొమ్మని సెలవిచ్చెను. ఆ దేవలుఁడు దుఃఖించుచుఁ దన నిలయంబునకు వచ్చి యేమియును తోఁచక నిరాహారంబులు లేక కృశించుచు, నొకనాఁడు కైలాసంబునకుం బోయి యా యిందుశేఖరుని పాదంబుల మీఁద వ్రాలి, దేవ దేవోత్తమా! దీనశరణ్యా! నా మొరాలకించుమని తన వర్తమానమును దనకుం గలిగిన శాపములను జెప్పిన, నా శివదేవుఁడు వానిం

జూచి, యోరి దేవలుఁడా! నీశాపములను దీర్చి రక్షించుటకు నేను సమర్థుండనుగాను, నాకును బ్రహ్మాది దేవతలకును గురుఁడే సమర్థుండు. అట్టిసద్గురునిశరణాగతుఁ బాత్రుండవై నీ శాపములను తొలఁగించు కొనుమని పలికి పోపొమ్మని సెలవిచ్చెను. ఆ దేవలుఁడు తనమనంబున నాకెట్టుల సద్గురు పాదమును బొందఁ గలుగునో యని దుఃఖించుచుఁ గొన్ని దినంబులకు వైకుంఠ పురంబునకుం బోయి, యా రమాకాంతుని పాదముల మీఁదం బడి, యో దేవ దేవోత్తమా! శరణాగత భక్తవత్సలా! దీనుండనైన నన్ను రక్షించు రక్షించు మని పెక్కువిధంబుల వినుతించి తనవర్తమానమును దనకుం గలిగిన శాపములను జెప్పి దుఃఖించెను. ఆ విష్ణుదేవుఁ, డోరి దేవలుఁడా! నిన్ను రక్షించుటకు నేను సమర్థుండనుగాను, నిన్ను శాపములనుండి తొలఁగించుటకు సద్గురునికంటె నితరుల కెవ్వరికిని శక్యంబుగాదు. సర్వలోకంబుల వారికి సద్గురుఁడే రక్షకుఁడు. నీవు సద్గురుని నాశ్రయించుము పొమ్మని సెలవిచ్చెను. ఆ దేవలుఁ, డకటా! త్రిమూర్తులుఁ సద్గురు పాదమునే పట్టుమని పలికిరి. సద్గురు పాదము నాకెట్టుల లభించును. అట్టి సద్గురుఁ డెందుండును. నాగతి యేమని దుఃఖించుచు, మిగుల సిగ్గును శీలెనింబొంది, భూలోకంబునకు నచ్చి యొందొక వన మధ్యంబుననుండు సరస్సులోదిగి జలపానముచేసి యందొక చెట్టుక్రిందం గూర్చుండి యేడ్చుచుండెను.



ఆ వనసమీపమున నాశ్రమమును గావించుకొని యున్న కశ్యపుండను మహాఋషియొక్క శిష్యులలోఁ గొందఱు గురుపూజ నిమిత్తముగా ఫలపుష్పములకై యావనంబునకువచ్చి యందు ఘోరముగా నేడ్చుచుండిన యా దేవలునింజూచి, యయ్యా! నీ వెవ్వఁడవు? నీదుఃఖమునకుఁ గారణమేమి? నీ నిజవర్తమాన మెఱింగించు మనిన; నా దేవలుఁడు తన వర్తమానమంతయు నెఱింగించి నన్ను రక్షించెడు సద్గురునిం జూపింపుఁడని వినయంబున బ్రార్థించిన, నా గురుపుత్రు లతని నాదరించి, యయ్యా! దుఃఖింపకుము. మా గురుఁడు శరణాగత భక్తవత్సలుఁడు, నీదుఃఖమును దీర్చి నిన్ను రక్షించుటకు సందియంబు లేదని, యతనిం దమ యాశ్రమంబునకు వెంటఁ బెట్టుకొని పోయిరి. ఆ దేవలుఁ డా సద్గురుమూర్తినిం గాంచి మిగుల వినయ భయభక్తులుగల వాఁడై యా మహాత్ముని పాదములకు సాష్టాంగ నమస్కారమును గావించి లేచి యంజలీబద్ధుఁడై, దీనరక్షకా! సద్గురు వర్యా! నన్ను రక్షించుమని తనవర్తమానమును, నింద్రాది దేవత లిచ్చిన శాపములను, తాను త్రిమూర్తుల నాశ్రయించుటయును, వారుచెప్పిన బుద్ధియును సర్వము నెఱింగించి, మహాత్మా! దేవరవారి ప్రభావమును వర్ణించి చెప్పుటకుఁ బదునాలుగు లోకంబుల వారికి మిగుల దుస్తరంబగుట సత్యము, దేవరవారి పాద సేవకుండనైతిని, నన్ను రక్షించుఁడని పెక్కువిధముల వినుతించిన, నాకశ్యప

మహాఋషి, కరుణగలవాఁడై యతని దీవించి, మానవ పుత్రా! నీవు భయపడకుమని యభయహస్తమును శిరస్సునందుంచి, కుడిహస్తమును నతని మస్తకమం దుంచి, యప్పా! సంచిత ప్రారబ్ధ కర్మంబులును దేవేంద్రాది దిక్పతుల శాపంబులను నెడను హస్తంబునం దుడిచి వైచితిని. నీకు నాగామి కర్మముండిన యెడల నీకు జన్మమును, సంచిత ప్రారబ్ధ కర్మంబులును వివిధశాపంబులును నంటునేగాని నీకు జన్మమే లేకుండిన యెడల నీకు వేనితోను సంబంధము లేదు. నిన్ను జన్మమునకు రాకుండఁ జేసెదను. నీకు విదేహకైవల్యము ప్రాప్తించు నటులం జేసెదను. నిన్ను శపించిన వారి శాపములను వ్యర్థములు గావించెదను. భయపడవలదని యతని నొసట విభూతి రేఖయుం దీర్చి, మానవ పుత్రా! సద్గురు పాదములకంటె నేమియును లేదు. ఇది సత్యముగా నమ్ముము. సద్గురునికంటె వేఱొండు రక్షకులు లేరు. ఇది నిత్యమని తెలియుము. సద్గురు మహిమ యిట్టిదని యెఱుంగుటకు నెవరికి నసాధ్యంబై యుండును, గురుపదంబునకంటె నేమియును లేదు. శరీరమే మాయ, ఆత్మయే మూలమాయ. నామరూపంబులు భ్రాంతి. ఈ మాయాభ్రాంతులు రెండును దబ్బర. ప్రపంచము కాల్పనికము. పరిపూర్ణమునకంటె నేమియును లేదు. పరిపూర్ణమే గురుపదము. గురుపదమే జననరహితము. ఇంతకంటె నేమియు లేదు. ఈ రహస్యము నెఱుం



గుట చేతనే త్రిమూర్తులు నీకు బుద్ధిచెప్పి యుంపిరి. నీవు బుద్ధిమంతుండవై చక్కఁగా నమ్ముము. శాశ్వతమైన పదవిని బొందుము. అహంకారాది మానసములను విడిచి శ్రద్ధాసక్తుండవై సద్గురు మహిమను దెలియుమని, పిండ - పద - రూప - భావములను గ్రహింపను బోధించి, యనుభవసిద్ధిని బొందించి, శిష్యా!

"నగురోరధికం, నగురోరధికం, నగురోరధికం,
నగురోరధికం। శివశాసనత, శ్శివశాసనత,
శ్శివశాసనత, శ్శివశాసనతః" అని గురువాక్యము.

కనుక, బరమశివుని యాజ్ఞవలన సద్గురునికంటె నధిక మేమియును లేదు. పరమశివుని యాజ్ఞవలన, సద్గురునికంటె నధిక మేమియును లేదు పరమశివుని యాజ్ఞవలన సద్గురునికంటె శ్రేష్ఠ మేమియును లేదు. పరమశివుని యాజ్ఞవలన సద్గురునికంటె శ్రేష్ఠ మేమియును లేదు. లేదని పార్వతిదేవికి పరమశివుఁడు, నాలుగుమార్లు నొక్కి మనోదృఢమునకై చెప్పెనుగాన, నీవును గురుపదముకంటె నేమియును లేదని మనోదృఢమును బొందుము.

"విదితం విదితం, విదితం విదితం, విజనం విజనం,
విజనం విజనం। హరిశాసనతో, హరిశాసనతో,
హరిశాసనతో, హరిశాసనతః" అని గురువాక్యము

గనుక, హరిశాసనతః శ్రీవిష్ణుదేవుని యాజ్ఞవలన, సద్గురు స్వరూపము శ్రేష్ఠమగు జ్ఞానస్వరూపముగా నున్నది. శ్రీవిష్ణుదేవుని యాజ్ఞవలన సద్గురు స్వరూపము విదిత

శ్రేష్ఠమగు జ్ఞానస్వరూపముగా నున్నది. శ్రీవిష్ణుదేవుని యాజ్ఞ వలన సద్గురుస్వరూపము జన్మరహితమైనదిగా నున్నది. శ్రీవిష్ణుదేవుని యాజ్ఞవలన సద్గురుస్వరూపము సదా జన్మరహితమైనదిగా నున్నది. నీవు స్థిరముగా నమ్ముమని పార్వతీదేవికి నాలుగుమార్గముల నొక్క మనోదృఢంబునకై చెప్పిరి గావున, నీవును సత్యముగా నమ్ముము. నిన్ను జన్మకర్మములులేని పరిపూర్ణునిగాఁ జేయుదునని పలికి, రూపాతీతస్థానమును సాక్షిచేసిన, నాదేవలుఁడు గురుపదమును దర్శించి యేమియును దోఁచక నిశ్చేష్టితుండై కొంతసేపు ప్రమాస్పృషియుండి, పిదప సద్గురుని పాదములపైఁ బ్రాలి, మహాత్మా! యిట్టి పట్టిదని నిర్దేశింపరాక యవాఙ్మానసగోచరంబైన పరిపూర్ణమును దర్శించితిని. ఆహా! మిగుల సద్భుతంబని పలికిన, నాసద్గురుఁడతని దీవించి, జ్ఞానపుత్రా! యిదియే గురుపదము, గురుపదమే బట్టబయలు, గురుపదమే పరమపదము. గురుపదమే యచలము. గురుపదమే కేవలాత్మ. గురుపదమే నిజస్వరూపము. ఈ గురుపదమునకంటె నేమియును లేదు. ఈ గురుపదమే నీ నిజస్వరూపము. ఇంతకంటె నేమియును లేదు.

“ఇదమేవశివం, ఇదమేవశివం, ఇదమేవశివం, ఇదమేవశివం! మమశాసనతో, మమశాసనతో, మమశాసనతో, మమశాసనత;” అని గురు



వాక్యముగనుక, నాయొక్క యాజ్ఞవలన 'ఇదమేవశివం' ఈ బట్టబయలే సర్వమంగళప్రపంచంబుగా నున్నది. నాయొక్క యాజ్ఞవలన - ఇదమేవశివం - ఈ పరిపూర్ణమే కేవలమంగళప్రపంచంబుగా నున్నది. నాయొక్క యాజ్ఞవలన- ఇదమేవశివం- ఈ కేవలాత్మయే సర్వమంగళప్రపంచంబుగా నున్నది. దీని నమ్మినవారికి నేభయములును లేవు. దీనిని నమ్మినవారికి విదేహకైవల్యము తప్పక సంభవించును. దీనిని నమ్మినవారే జన్మశూన్యులు. ఇది తప్ప. మఱి దీనిని నమ్మనను జననమరణప్రవాహములు వెంటనంటి బాధించును. ఈపరిపూర్ణమార్గమునకంటెను దొడ్డమార్గము లే లోకమందును లేవు. అన్ని లోకములును పాడైపోగా శేషించి నిలిచిన యీ బట్టబయలునకంటె నేమియును లేదు. సర్వశూన్యంశూన్యమే యీ గురుపదము. ఈ గురుపదమునకంటె నేమియును లేదు. ఇదియే ద్వాదశాక్షరీ మంత్రము. ఆత్మశరీరములు రెండును షోడశాక్షరీమంత్రము. ఈషోడశాక్షరిని నమ్మవలదు. ఇది చూచుచుండఁగానే మటుమాయముగాఁ బోవును. కలలోవచ్చిన యేనుఁగు జాగ్రతయందెటులఁదబ్బరో యటుల నీ గురుపదముచేత మేల్కొనిన వారికి నాత్మశరీరము లేమియును లేవు ఈ రెండును మాయా భ్రాంతులు. ఈ గురుపదము వలన నాత్మగాని శరీరముగాని పంచమహాభూతములు గాని, ప్రపంచముగాని పుట్టనే లేదు. లోకంబులు మాయ. లోకేశులు మాయ సర్వమును

సింధ్య. ఈ గురుపదమునకంటె నేమియును లేదు. రజ్జువునందు సర్పభ్రాంతి దోఁచినటుల నీ నిరంజనమందు మిథ్యాప్రపంచము భ్రాంతివలనం దోఁచుచుండును. శశశృంగ సమముగా నామరూపములు గల ప్రపంచము దబ్బరయని నీ మనంబున నిశ్చయమును బొందుము. ఎండమావుల యందు నీరు లేనటుల నీ గురుపదమందుఁ బ్రపంచము లేనే లేదు. ఈ లేనిదానికను నున్నదని చెప్పరాదు. ఈ తొలుక సర్వకాలముల యందు నొక్కటే విధంబుగా నుండక స్వప్నమువలె గనుపించి మరల మటుమాయము గాఁబోవును. శరీరాత్మలను నమ్మవలదు. ఈ గనుపించెడు దృశ్యరూపము లన్నియును మాయా భ్రాంతులు. వానిని నీవు నమ్మవలదు. ఈ గురుపదమునకంటె నేమియును లేదు.

"శివక్రోధాద్గురుస్త్రాతా । గురుక్రోధా చ్ఛివో
నహి । తస్మాత్సర్వప్రయత్నేన । గురో రాజ్ఞాం
నలంఘయేత్" అని పరమగురుని వాక్యము గనుక, పరమశివునియొక్క కోపమునుండి సద్గురుఁడు రక్షింపఁ గలఁడు గాని, సద్గురునియొక్క కోపము నుండి పరమ శివుఁడు రక్షింపఁజాలఁడు. ఆకారణముచేత శిష్యుఁడు సద్గురునియాజ్ఞను నతిక్రమింపఁగూడదు. శ్రీమూర్తులు మొదలగు వారి శాపములను సద్గురుఁడు నివారింపఁ జేయునేగాని, సద్గురుని శాపమును నివారింపఁ జేయుటకు మూఁడు లోకంబుల వారికి మిగుల దుస్తరంబు, నీవు సర్వశాపములనుండి విముక్తుండవైతివి, జన్మమే



నున్న యూరొను. విదేహకైవల్యమును బొంది శాశ్వత సుఖానందమును బొందుమని దీవించిన, నా దేవలుఁడు సాష్టాంగ నమస్కారమును గావించి, మహాత్మా! నేను సర్వకోరాన్యుండనైతిని. గురుపదమునకంటె నేమియును లేదని దృఢనిశ్చయుండ నైతినని చెప్పి సద్గురు సేవఁ జేయుచుఁ, పిమ్మట విదేహ కైవల్యమును బొందెను. కాబట్టి నీవును సర్వసంగములను విడిచి నీవురికం బొమ్మని దీవించి యుంచెను. ఆసౌవీరమహారాజును దప్పక విదేహ కైవల్యమును బొందెను. అజడభరతుండును గేవల నిరామయుండై కొన్నిదినంబులుండి పిదప విదేహకైవల్యమునుఁబొందెను. ఈజడభరతోపాఖ్యానము సర్వపాపక్షయంబని చెప్పిన, నా పరీక్షన్మహారాజు మిగుల సద్సుఖానందమునుఁబొంది, యోగీశా! ఈజడభరతోపాఖ్యానము సర్వపాపక్షయంబని చెప్పుటకు నే సంశయంబును లేదు. నేను కృతార్థుండ నగుటకు నే సందియంబును లేదని, యా శుకబ్రహ్మమును బెక్కువిధముల వినుతించెను.

గద్య॥ ఇది శ్రీమద్వేదాంత సారుండును, భవనాశ రహితుండును, మహాకారణతను నిరసనుండును, సర్వద్వంద్వాతీతుండును, సర్వపరిపూర్ణుండును, నగు సద్గురుస్వామికి శిష్యుండును, చంద్రవంశ జాతుండును, ఆత్రేయగోత్ర పవిత్రుండును, ఆదివెలమ కులోద్భవుండును, నగు పోకల - రామగోపాలు నాయనివారికిఁ దృతీయ పుత్రుండును, సాధుజన మిత్రుండును, అచల భావజ్ఞుం

మును నగు, పోకల - శేషాచలమునాయుని వారిచే రచియింపఁబడిన, జడభరతోపాఖ్యానంబు నందు. జడభరతుండు సౌవీరమహారాజునకుం బోధించిన రూపభావ ప్రభావంబును, సంవర్తుండను మహాఋషి చరిత్రంబును, మరుత్తమహారాజు వృత్తాంతంబును, సంవర్తమహాఋషి యజ్ఞమును నెఱవేర్చుటయును జడభరతుండు సౌవీర మహారాజునకుఁ బోధించిన రూపాతీతభావమును. దేవలుండను ఋషుని చరిత్రంబును, దేవలుండు కశ్యపుండను మహాఋషి పాదములను బట్టుటయును, సద్గురు ప్రభావంబును, గల యుత్తరభాగము సర్వంబును, సమాప్తము.

ఈ వేదాంతగ్రంథమును శ్రద్ధగాఁ జదువు వారును, మిగుల నాసక్తితో వినువారును, దప్పక పుణ్యలోకంబును బొందుదురు, సద్గురు ముఖంబున, పిండ, పద, రూప, రూపాతీతభావంబులను జక్కఁగా రచియించి యనుభవించియులైన పుణ్యాత్ములు, పిండ భావము వలన సాలోక్యమును, పదభావము వలన సాయుజ్యమును, రూపభావమువలన మోక్షమును, రూపాతీత భావంబువలన, విదేహకైవల్యమును బొందుటకు నేసందియంబును నుండదు. ఇది నిజగురువాక్యము, లోకంబులు తలక్రిందులైనను, సూర్యచంద్రులు గతులుదప్పినను, భూమిగిర్రందిరిగి పాతాళంబున కంటినను, నిజగురు వాక్యము తప్పఁగా నేరదు. ఇది సత్యము. ఇది వేదాంతము.

